# Cuddles always say "I love you."

Show your little ones how much you love them! And is there a better way of doing that than giving them a huggable, cuddlable playmate?

Cuddles. From the people who have given children the delightful entertainer of a magazine, Chandamama. Cuddles. A whole new range of stuffed toys. And, your old favourites. And, cute surprises being introduced regularly. Each one a sweet, adorable companion to your child. Absolutely safe. Designed to withstand childhandling.

Well, the fun and excitement of the festive season is just round the corner. Make it memorable for your child with a special gesture. With a Cuddle.

- CUDDLES — Stuffed toys from Chandamama.
- SAMMO — Mechanical and electronic toys from Chandamama

## CUDDLES

Manufactured in technical collaboration with Sammo Corporation, South Korea

**CHANDAMAMA TOYTRONIX**

Chandamama Toytronix Private Limited, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026

*from*

**THE HOUSE OF**

**CHANDAMAMA**

Mudra M CTPL 4274

**CUDDLES AND SAMMO TOYS WILL BE AVAILABLE AT ALL LEADING TOY OUTLETS EXCEPT IN THE STATES OF ASSAM, HIMACHAL PRADESH, MADHYA PRADESH AND NORTH EASTERN STATES**



# చందమామ

డిసెంబర్ 1991



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





విడి ప్రతి: 4-00

సంవత్సర చందా: 48-00

CASIO

# వెయ్యండి తై అంటూ తాళం! చెయ్యండి ఝుమ్ అంటూ నృత్యం!

నృత్యం చెయ్యడం (జామింగ్) కేసియో కీబోర్డ్‌తో ఎంతో తేలిక. ఎందుకంటే, సరిగ్గా స్టార్స్‌లాగ వాయిద్యాలను వాయించడానికి అవసరమైన లక్షణాలన్నీ వున్నాయి దీన్లో. 'స్క్రాచ్' చెయ్యండి డిస్కుని, పేడ్‌ని నొక్కండి, మీకు మనసైన బాణీలలోని పాటల్ని పాడండిక. వెయ్యండి 'తై' అంటూ తాళం, మీ వీధి 'రాక్' తో అదిరిపోయేలాగ, కేసియోతో మీరు స్టైయిల్‌లో డాన్స్ చేస్తున్నారన్నమాట.

SOUND KIDS












**CITY MUSIC CO., PTE LTD.**
Singapore Tel 3377058, 3377545

**ONFLO MUSIC CO., LTD.**
Hong Kong Tel: 722 4195

**RAINBOW PHOTO FINISHERS PTE LTD.**
Nepal, Kathmandu Tel: 221724

**GENERAL ENTERPRISES COMPANY**
U.A.E., Dubai Tel: 224131/2/3

**MAHMOOD SALEH ABBAR CO.**
Saudi Arabia, Jeddah Tel: (02)6473995

**ARABIAN CAR MARKETING CO.,LTD.**
Oman Tel: 793741

**CASIO COMPUTER CO., LTD.**
Tokyo, Japan.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'　　　సంచాలకుడు : నాగిరెడ్డి

## క్షమాగుణం!

ఇటీవల కొత్తఢిల్లీలో స్నేహం, క్షమ అనే విషయాల మీద ఒక సదస్సును ఏర్పాటు చేశారు. విజ్ఞులందరూ కాంక్షించే విశ్వమానవ సౌభ్రాతృత్వం, ప్రపంచశాంతి అనే మహోన్నత లక్ష్యాలను సాధించడానికి మనిషిలో స్నేహం, క్షమ చాలా అవసరం.

ప్రపంచంలో ఏ వ్యక్తిగాని, మరొక వ్యక్తి మీద ఆధారపడకుండా, ఒంటరిగా జీవించలేడు. మనిషి మనుగడకూ, సమాజ పురోగతికీ పరస్పర సహకారం ఎంతైనా అవసరం. సహకారం స్నేహానికి పునాది వంటిది. జీవితంలో స్నేహం కీలకమైన పాత్ర వహిస్తుంది.

స్నేహితులు ఒకరికొకరు హాని తలపెట్టరు. పరిస్థితుల కారణంగా ఒకవేళ మిత్రుల మధ్య మనస్పర్థలు వచ్చినప్పటికీ, 'తప్పు చేయడం మానవ సహజం; క్షమించడం దైవగుణం!' అని సర్దుకుపోయే మనస్తత్వం అలవరచుకోవడం మంచిది. క్షమించే గుణం రావాలంటే సహనం కావాలి. ''ఎవరైనా నీ కుడి ఛెంపమీద కొడితే, ఎడమ చెంపచూపు!'' అని బైబిల్ ప్రబోధిస్తున్నది. క్షమాగుణానికి మించిన ఉత్తమగుణం మరొకటిలేదు!

ఢిల్లీలో జరిగిన ఆ సదస్సులో ఉపన్యసిస్తూ, మన ప్రధాని శ్రీ పి. వి. నరసింహారావుగారు అహింస, క్షమాగుణాలు పెంపొందడానికి ప్రతి ఒక్కరూ కృషి చేయాలి, అని అన్నారు. స్నేహితులమధ్య లాగానే, వివిధ దేశాలమధ్య కూడా పరస్పర సహకారం, స్నేహం. పెంపొందాలి. అప్పుడే క్రిస్మస్ సందేశాలయిన—భూప్రపంచంలో శాంతి, పరస్పర స్నేహాభిమానాలు అన్న ఉదాత్త ఆశయాలు నిజమవుతాయి!

సంపుటి 89　　　డిసెంబర్ '91　　　సంచిక 6

విడి ప్రతి : 4-00　　: :　　సంవత్సర చందా : 48-00






# ధైర్యానికి నోబెల్ శాంతి బహుమతి

ఈ సంవత్సరం నోబెల్ శాంతి బహుమతి మియాన్మార్ (బర్మా) కు చెందిన శ్రీమతి అంగ్ సాన్ సూకీకి లభించింది. ఇది మనకెంతో ఆనందదాయకమైనది.

ఇటీవలి ఆసియాఖండ చరిత్రలో ఆమె సాగిస్తూన్న శాంతియుత పోరాటం చాలా విలక్షణమైనది, ఎంతో విశిష్టమైనది''—అని నోబెల్ కమిటీ ప్రశంసా పత్రంలో పేర్కొన్నది. ఆధునిక బర్మా నిర్మాతగా ప్రసిద్ధిగాంచిన అంగ్ సాన్ కుమార్తె శ్రీమతి సూకీ. బ్రిటిష్ పాలనా కాలంలో బర్మా భారత సామ్రాజ్యంలో భాగంగా ఉండేది. అంగ్ సాన్ ప్రజా పోరాటం సాగించి బర్మాకు స్వతంత్రం సాధించి పెట్టాడు. అయితే, బర్మా స్వతంత్రం పొందిన తరవాత, దురదృష్ట వశాత్తు 1947 వ సం॥ జూలై 19 వ తేదీన అంగ్‌సాన్ ఎనిమిదిమంది అనుచరులతో సహా హత్య చేయబడ్డాడు.

ఎందుకంటే, అంగ్‌సాన్‌సూకీ ప్రారంభ విద్యాభ్యాసం ఢిల్లీలోనే జరిగింది. ఆ రోజులలో ఆమె తల్లి, శ్రీమతి ఖిన్ కీ మన దేశంలో బర్మా రాయబారిగా ఉండేవారు.

ఇద్దరు పిల్లలకు తల్లి అయిన అంగ్ సాన్‌సూకీ వయసు 46 సంవత్సరాలు. ''ప్రపంచ వ్యాప్తంగా ప్రజాస్వామ్య సాధనకూ, మానవ హక్కుల రక్షణకూ పోరాడుతూన్న ప్రజలకు, తన శాంతి యుత పోరాటం ద్వారా అంగ్‌సాన్‌సూకీ కొండంత బలాన్ని సమకూరుస్తున్నది.

అప్పుడు సూకీ రెండేళ్ళ పాపగా ఉండేది!

ఢిల్లీలో కాలేజీ చదువు పూర్తి చేశాక సూకీ ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చేరి రాజకీయశాస్త్రంలోనూ, ఆర్థికశాస్త్రంలోనూ ఉన్నత విద్యనభ్యసించి పట్టభద్రురాలయింది. ఆ తర్వాత లండన్ విశ్వవిద్యాలయంలో కొంతకాలమూ, ఐక్యరాజ్యసమితిలో మరి కొంతకాలమూ ఉద్యోగం చేసింది. ఒక ఆంగ్లేయుణ్ణి వివాహమాడడం వల్ల, ఆమె మళ్ళీ ఇంగ్లాండు చేరింది. ఆ తరవాత పరిశోధన నిమిత్తం ఆమె మన దేశానికి వచ్చి సిమ్లాలోని 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీస్'లో చేరింది. అక్కడ ఉన్నప్పుడే ఆమె రెండు పుస్తకాలు రాసింది. ఒకటి ఆమె తండ్రి చరిత్ర; మరొకటి బర్మాదేశం గురించి పిల్లలకు విశదీకరించే 'లెటజ్ విజిట్ బర్మా' అనే పుస్తకం.

ఆ తరవాత ఆమె పరిశోధనలకోసం లండన్ చేరింది. తల్లి తీవ్ర అనారోగ్యంతో ఉన్నదని తెలిసి అక్కడినుంచి రంగూన్ వెళ్ళింది. అప్పుడు బర్మా ప్రజలు జనరల్ నేవిన్ నియంతృత్వ పాలనలో కష్టపడుతున్నారు. 1988వ సం॥లో ఆమె బర్మాకు తిరిగి రాగానే, ప్రజలు ఆమె నాయకత్వంలో పోరాడడానికి సిద్ధపడ్డారు. పాలకులు ఆమె చర్యలను అనుమానంతో పరిశీలించసాగారు. ఆగస్టు 8వ తేదీ పెల్లుబికిన విద్యార్థుల పోరాటాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేశారు. ప్రజాస్వామ్యం కోసం మున్ఫై సంవత్సరాలుగా సాగుతూన్న పోరాటాన్ని చూస్తూ సూకీ ఊరుకోలేకపోయింది. సెప్టెంబర్ 12న జరిగిన సమావేశంలో తాత్కాలిక ప్రభుత్వ స్థాపన జరగాలనీ, ఆ ప్రభుత్వ పర్యవేక్షణలో ఎన్నికలు జరపాలనీ తీర్మానించింది. సూకీ మరిద్దరు నాయకులతో కలిసి 'నేషనల్ లీగ్ ఫర్ డెమొక్రసీ' (ఎన్. ఎల్. డి) అనే జాతీయ ప్రజాస్వామ్య పార్టీని స్థాపించింది. సెప్టెంబర్ 24 తేదీ సూకీ ఆ పార్టీకి ప్రధాన కార్యదర్శి అయింది.

1989వ సం॥ జూలై 19వ తేదీ త్యాగులదినం సందర్భంగా ఆమె తండ్రి ఆంగ్‌సాన్ 42వ వర్థంతిని పురస్కరించుకుని బ్రహ్మాండమైన ఊరేగింపు జరిపింది మరునాడే పాలకులు ఆమెను గృహనిర్బంధంలో ఉంచారు. అయినప్పటికీ 1990వ సం॥లో జరిగిన సాధారణ ఎన్నికలలో ఆమె పార్టీ విజయం సాధించింది. అయితే, పాలకులు ప్రజాభిప్రాయాన్ని అంగీకరించడానికి నిరాకరించారు. గత సంవత్సరం మియాన్‌మార్‌గా పేరు మార్చిన బర్మాలో ఇంకా ప్రజాస్వామ్యం రావలసి ఉన్నది!

ప్రజాస్వామ్యం కోసం, మానవ హక్కుల కోసం అహింసామార్గంలో ఆంగ్‌సాన్ సూకీ, సాగిస్తూన్న ప్రజాపోరాటాన్ని నోబెల్ కమిటీ శ్లాఘించింది. ఆమె అకుంఠిత దీక్షకూ, అచంచలమైన ధైర్యసాహసాలకూ గుర్తింపుగా శాంతి బహుమతిని ఇచ్చింది!



# మంత్రగత్తె పెంపుడుకూతురు

కొండాపురం అడవుల్లో ఎర్రమట్టి దిబ్బ మీద గుడిశె వేసుకుని వుండేది. ఒక ముసలి మంత్రగత్తె. కమల దాని పెంపుడు కూతురు. పెళ్ళీడుకొచ్చిన కమల, మంత్రగత్తె ఆలనాపాలనా చూస్తూండేది.

ఒకరోజు సాయంత్రం, ఒక పాతికేళ్ళ యువకుడు, ఆ దిబ్బమీదికొచ్చాడు. ఆ సమయంలో మంత్రగత్తె గుడిశె బయట నులకమంచం మీద కూర్చుని, కమల చేత తన రాగిరంగు జుట్టు దువ్వించుకుంటున్నది.

ఆ యువకుణ్ణి చూడగానే మంత్రగత్తె పిల్లికళ్ళు ఎర్రబడ్డాయి. అది యువకుడికేసి ఉరిమిచూస్తూ, "ఎవడివిరా నువ్వు? ఈ దిబ్బ ఎక్కడానికి ఎన్ని గుండెలు నీకు!" అన్నది.

"అత్తా, చావాలనుకున్నవాడికి భయం ఏమిటి? నన్ను ఏ కోడిపుంజుగానో మార్చి కోసుకుతినెయ్యి." అన్నాడా యువకుడు విచారంగా.

"ఆముదం తాగినట్టు మొహం పెట్టే కుర్రవెధవలంటే, నాకసహ్యం! అసలు ముందు నీకొచ్చిన కష్టమేమిటో చెప్పరా, అబ్బీ!" అని అడిగింది మంత్రగత్తె.

ఈ లోపల కమల గుడిశెలోపలికి వెళ్ళి చిన్న లోటాలో చల్లని మంచినీళ్ళు తెచ్చి యువకుడికిచ్చింది.

యువకుడు లోటాలోని నీళ్ళు గడగడ తాగి, "నా పేరు శౌరి, అత్తా! నేను మా పక్కింటి అమ్మాయి అలివేణిని ప్రేమించాను. అయితే, ఆమె తండ్రి ఆమెకోసం వేరే సంబంధాలు చూస్తున్నాడు. ఈ రోజు ఉదయం నేను, అయనను కలుసుకుని, పెళ్ళంటూ చేసుకుంటే అలివేణినే చేసుకుంటానని చెప్పాను. దానికి అయన నామీద మండిపడి, కానీకి కొరగాని

మాచిరాజు కామేశ్వరరావు



వెధవవి పెళ్ళిచేసుకుని, పెళ్ళాన్ని ఎలా పోషిస్తావు? అంటూ అవమానించాడు. నాకు బతుకుమీద విరక్తి పుట్టి, నిన్ను వెతుక్కుంటూ వచ్చాను!'' అన్నాడు పెద్దగా నిట్టూరుస్తూ.

మంత్రగత్తె మారుమాట్లాడకుండా దిబ్బ దిగి, కింద మడుగులో వున్న నల్లరంగు బాతును మెడపట్టుకుని తీసుకువచ్చింది.

''ఇప్పుడు బాతు కూరతో నాకు విందు చేయబోతున్నావా?'' అని అడిగాడు శౌరి ఉత్సాహంగా.

''అదేంకాదు. ఈ బాతు పెట్టమన్నప్పుడల్లా గుడ్లు పెడుతుంది. నీకు ఓపికున్నన్ని సార్లు చెప్పి, రోజంతా దీనితో గుడ్లు పెట్టించవచ్చు. ఆ గుడ్లమ్మగా వచ్చిన ఆదాయంతోఅలివేణినిభేషుగ్గాపోషించుకోగలనని, నీకాబోయే మామకు చెప్పు,'' అన్నది మంత్రగత్తె.

శౌరి ఆబాతును తీసుకువెళ్ళి, మర్నాడు చీకటిపడకముందే, బాతుతో సహా తిరిగి మంత్రగత్తె దగ్గరకు వచ్చాడు.

''అదేమిటిరా, అబ్బీ! పెళ్ళాంతో సహా నా కాళ్ళకు దణ్ణం పెట్టడానికి వస్తావనుకుంటే, ఇలా దిగులు ముఖంతో వచ్చావేం?'' అని అడిగింది మంత్రగత్తె.

ఆ పక్కనే మల్లెపువ్వులు కోసుకుంటున్న కమల, వెంటనే లోపలకు వెళ్ళి లోటాతో మంచినీళ్ళు తెచ్చింది. శౌరి నీళ్ళు తాగి, ''ఈ బాతును చూసి అలివేణి తండ్రి నన్ను మెచ్చుకోకపోగా — నా తెల్లపిల్లిని వదిలితే, నీ నల్లబాతును క్షణంలో చంపి తినేస్తుంది. ఆ తర్వాత మీ మొగుడు పెళ్ళాలు బతికేదెలా? అని అడిగాడు. ఈ బతుకు వృథా, అత్తయ్యా!'' అన్నాడు.

మంత్రగత్తె క్షణం ఆలోచించి, గుడిశె మీద బోర్లించి వున్న వెదురు బుట్టను తెచ్చి, శౌరి చేతికి ఇస్తూ, ''ఈ బుట్టను బోర్లించి, కింద ఏ కూరగాయలు కావాలనుకుంటే, ఆ కూరగాయలుంటాయి. పెట్టుబడిలేని, ఈ కూరగాయల వ్యాపా

రంతో, తన కూతుర్ని పువ్వుల్లో పెట్టి చూసుకుంటానని చెప్పు, నీ కాబోయే మామగారికి!'' అన్నది.

శౌరి ఆ బుట్టను తీసుకుని బయలుదేరి, మర్నాడు సాయంత్రానికి దాన్ని నెత్తిన బోర్లించుకుని, మంత్రగత్తె దగ్గిరకు వచ్చాడు.

''అదేం అవతారంరా! ఈసారి ఏమన్నాడు, నీమామ?'' అంటూ ఆశ్చర్యపోయింది మంత్రగత్తె.

''ఆయన బుట్ట మహిమ పూర్తిగా వినకుండానే—ఇంత నిప్పు రవ్వ అంటిస్తే, బుట్ట బూడిద అవుతుంది. ఆ తర్వాత నా కూతురు బతుకు బుగ్గి అవుతుంది. ఈ టక్కుటమారాలు, నాదగ్గిర కాదు, అంటూ, నా మొహంమీదే తలుపేసుకున్నాడు, అత్తా!'' అని కమల తెచ్చిన మంచినీళ్ళ లోటా అందుకున్నాడు, శౌరి.

మంత్రగత్తె చాలాసేపు ఆలోచించి, గుడిశెలో ఒక మూలపడివున్న పాతకాలపు చెక్కపెట్టె నొకదాన్ని, ఇవతలకు ఈడ్చుకు వచ్చి, ''ఈ పెట్టె మహిమ అద్భుతంరా, అబ్బీ! ఈ దెబ్బతో నీకాబోయే మామ, నీ కాళ్ళు కడిగేస్తాడు. ఇందులో చేయి పెడితే, కోరుకున్న వస్తువు చేతికి చిక్కుతుంది. అలా అని నువ్వు ప్రేమించిన అలివేణిని కోరుకునేవు! ప్రాణం లేని



వస్తువులే ఇందులో దొరుకుతాయి,'' అని చెప్పింది.

శౌరి ఆ పెట్టెను నెత్తిన పెట్టుకుని వెళ్ళి, మర్నాడు సాయంకాలం తిరిగి వస్తూనే దాన్ని గుడిశె ముందు గిరవాటు వేశాడు.

''నీ మామకు, ఈ పెట్టె కూడా పనికి రాలేదా?'' అంటూ కోపంగా ప్రశ్నించింది మంత్రగత్తె.

''ఇక వాడి సంగతి నా ముందు తీసుకు రాకు, అత్తా! వాడన్న మాటలకు నా కడుపు మండిపోతున్నది. నీకు తెలిస్తే కొంప మునుగుతుంది. ఏమనుకున్నాడో,'' అన్నాడు శౌరి ఆయాసపడుతూ.



చూస్తూ—ఈ అద్భుత వస్తువులన్నీ ఎక్కడ నుంచి తెస్తున్నావు? చూడబోతే దిబ్బ మీదున్న మంత్రగత్తె ప్రాపకం సంపాదించినట్టుంది. అటువంటప్పుడు, నా కూతుర్ని పెళ్ళాడడమెందుకు? వెళ్ళి, ఆ మంత్రగత్తె పెంపుడుకూతురి మెడలోనే మూడుముళ్ళూ వెయ్యి. అంటూ పళ్ళు కొరుకుతూ, నాకేసి చూశాడతయ్యా!'' అని చెప్పాడు శౌరి.

ఆ మాటలు వింటూనే కమల ఏదో పని వున్నదానిలా గుడిశెలోకి వెళ్ళి పోయింది.

మంత్రగత్తె కాసేపు ఆలోచిస్తూ ఊరుకుని, ''అతనన్నదాంట్లో నాకేమీ తప్పు కనిపించడం లేదల్లుడూ! ఇంతకూ, నీకు అభ్యంతరం లేకపోతే నేనుమా!'' అన్నది.

శౌరి తడబడుతూ, ''కమలకు, నేను నచ్చాలికదా!'' అన్నాడు.

''కమలకు, నేను ఎంత చెబితే అంత. అయితేమరి, పెళ్లి ఎప్పుడు? ఎక్కడ?'' అని అడిగింది మంత్రగత్తె.

''నాకు పట్నంలో ఉద్యోగం వచ్చింది. పెళ్ళి నిరాడంబరంగా గుళ్ళో జరిగి పోతుంది,'' అన్నాడు శౌరి.

రెండు రోజుల్లో పెళ్ళి జరిగిపోయింది.

శౌరి, భార్యతో సహా పట్నం బయలుదేరే సమయంలో, మంత్రగత్తె అతణ్ణి, ''అ

''అంత అమర్యాదగా మాట్లాడాడా? ఏం అన్నాడో నాకు తెలియాల్సిందే,'' అన్నది మంత్రగత్తె ఆవేశంగా.

శౌరికోసం మంచినీళ్ళు తెచ్చిన కమల, లోటాను మంత్రగత్తెచేతికిచ్చి, "నువ్వెందుకమ్మా, అంతగా ఆవేశపడిపోతావు? అసలే నీ ఆరోగ్యం అంతంత మాత్రం,'' అన్నది విచారంగా.

మంత్రగత్తె మంచినీళ్లు తాగి, ''ఇప్పుడు చెప్పరా, అబ్బీ! ఆ పొగరుబోతు ఏమన్నాడు?'' అన్నది.

''ఈ పెట్టె మహిమ చూసి, ముందు అయనకు నోటమాట రాలేదు. తర్వాత కాస్త తెప్పరిల్లి, నాకేసి అనుమానంగా

మూడు అద్భుత వస్తువులూ, వెంట తీసుకుపోవామరి, అల్లుడూ?'' అని అడిగింది.

''అవసరం లేదత్తా! నేను కష్టపడి సంపాయించే డబ్బు, మేం బతకడానికి చాలు. మాయమంత్రాలతో ఎన్నాళ్ళు బతగ్గలం?'' అన్నాడు శౌరి.

"భేషయిన మాట చెప్పావు, అల్లుడూ!" అంటూ మంత్రగత్తె, శౌరిని మెచ్చుకున్నది.

తర్వాత వాళ్ళిద్దరూ పట్నం బయలుదేరి, మధ్యాహ్నంవేళ ఒక మడుగు దగ్గిర చెట్టు నీడలో కూర్చుని, మంత్రగత్తె ఇచ్చిన రొట్టెలమూట విప్పారు. లోపల రొట్టెలతోపాటు, మంత్రగత్తె రాసిన ఉత్తరం ఒకటున్నది. ఆ ఉత్తరంలో—

''అల్లుడూ! అత్తను మించిన అల్లుడినని మురిసిపోకు. మొదటి రోజే నువ్వు కమలకోసం వచ్చావని, నేను గ్రహించాను. చాలాసార్లు అడవిలో తచ్చాడుతూ, కమలను చూసే నిన్ను, నేను మరిచిపోలేదు. అయితే, నీ ప్రేమకు పరీక్ష పెట్టడానికే అద్భుత వస్తువుల ఆశ కల్పించాను. ఎవరో పక్కింటి అలివేణిని ప్రేమించినట్టు, నువ్వు చెప్పేదంతా కపట నాటకమని, నేను ముందే పసిగట్టాను. అడిగిన వస్తువునల్లా ఇచ్చే, అద్భుతశక్తులు గల పెట్టెను తిరిగి తీసుకువచ్చాక, కమలపై నీకెంత ప్రేమ వున్నదో, నాకర్థమైంది. ఆలుమగలు ఇద్దరూ కలకాలం సుఖంగా వుండండి. నేను బతికి వున్నంత కాలం, ఏడాది కొకసారైనా వచ్చి, ఈ ముసలిదాన్ని చూసి వెళ్ళండి.'' అని వున్నది.

''చూశావా, మా అమ్మ ఎంతమంచిదో! అయినా నన్ను అందరూ మంత్రగత్తె పెంపుడుకూతురనే పిలుస్తారు.'' అన్నది కమల బాధగా చీరచెంగుతో కళ్ళు ఒత్తుకుంటూ.

''ఇక మీదట అందరూ నిన్ను, శౌరి భార్య అంటారులే. బాధపడకు!'' అంటూ భార్యను ఊరడించాడు శౌరి.



# మంచిలక్షణం

వల్లభుడనేవాడు లంచగొండి. ఒకసారి లంచం తీసుకుంటూ దొరికిపోయాడు. రాజు వాడిని సేవానదనానికి పంపాడు. సేవానదనంలో మతిస్థిమితం లేనివాళ్ళే కాక, దీర్ఘకాలిక వ్యాధులతో బాధపడే రోగులు కూడా వుంటారు. నేరస్థులను అలాంటివాళ్ళకు సేవచేయడానికి పంపి శిక్షించడం రాజుకు రివాజు.

సేవానదనానికి ధారనుడనే మహాత్ముడు వచ్చి, అక్కడి రోగులందరినీ పేరు పేరునా పలకరించి, మంచి చెడ్డలు విచారించి వారంరోజులపాటు అక్కడే వుండి వాళ్ళకు సేవలు చేశాడు.

వల్లభుడు ఇది చూసి ఎంతో ఆశ్చర్యపడి, ధారనుడితో, "స్వామీ! తమరు మహాత్ములు. ఇక్కడి రోగులందరినీ సేవించుతున్నారు. సిగ్గులేదా?" అన్నాడు.

"మానవసేవ చేయడానికి సిగ్గెందుకు నాయనా, గర్వపడాలి కానీ!" అన్నాడు ధారనుడు.

వల్లభుడు అయనకు తన కథ చెప్పుకుని, "ఇంతకాలం ఇక్కడ పని చేయాల్సివచ్చినందుకు సిగ్గుపడుతున్నాను. కానీ ఇక మీదట నేనూ గర్వపడతాను," అన్నాడు.

ధారనుడు మందలిస్తున్నట్టుగా, "ఏ పనీ నగంలో మానడం మంచి లక్షణం కాదు. నువ్వు సిగ్గుపడడం కొనసాగించడమే నబబు!" అని వెళ్ళిపోయాడు.

ధారనుడు మానవసేవ చేయాలని అక్కడికి వస్తే, వల్లభుడు నేరానికి శిక్షగా అక్కడికి వచ్చాడు. ఏ పని చేస్తున్నారని కాక, ఎందుకు చేస్తున్నారన్నదాని మీదే, ఒక పనిలోని మంచి చెడ్డలు ఆధారపడి వుంటాయి! ఈ విషయం అర్థం అయ్యాక వల్లభుడు, తనను ధారనుడితో పోల్చుకున్నందుకు సిగ్గుపడడమే గాక, తనలోని చెడ్డ లక్షణాలను విడిచిపెట్టడానికి ప్రయత్నించడం ప్రారంభించాడు.

— శ్రీరామ కమల్





# అపూర్వుడి సాహసయాత్రలు

## 10

[అపూర్వుడు, సమీరుణ్ణి బందిపోటు దొంగలనుంచి రక్షించాడు. అపూర్వుడి ఆదేశానుసారం సమీరుడు, సముద్రపు దొంగల పాలయిన ఐదుగురు కుర్రవాళ్ళను కాపాడాడు. శిలాద్వీపంలో దొంగలు దాచిన నిధిని, అపూర్వుడి కోరిక మేరకు ప్రజోపయోగ కార్యాలకు ఉపయోగించమని, సమీరుడు రాజుకు అప్పగించాడు. సముద్రపు దొంగలు బందీలయ్యారు.—తరవాత]

దారిదోపిడీలు జరిపే బందిపోటు దొంగలూ, వర్తకుల ఓడలను దోచుకునే సముద్రపు దొంగలూ బందీలుగా పట్టుబడడంతో రాజ్యంలో దొంగల భయం తొలగిపోయింది. అద్భుత శక్తులుగల దివ్య పురుషుడెవరో, మంచివారికి రక్షణగా ఉన్నాడన్న వదంతి పుట్టడంవల్ల, దుర్మార్గుల దుండగాలు తగ్గాయి. ధర్మవర్తనుడయిన రాజు, సమీరుణ్ణి తన సలహాదారుగా నియమించుకున్నాడు. రాజ్యంలో ఎలాంటి సమస్యలూ లేకుండా కొంతకాలం జరిగింది.

అపూర్వుడు హిమాలయాలను చేరి సదానందముని తపస్సు చేసుకుంటూన్న గుహ సమీపంలోనే ధ్యానంలో గడపసాగాడు. ఈ విషయం ఒక్క సమీరుడికి మాత్రమే తెలుసు. ఏకాగ్రచిత్తంతో ఎప్పుడు తలుచుకున్నా మరుక్షణమే ఎదట ప్రత్యక్ష



మయ్యేటట్టు, అపూర్వుడు సమీరుడికి వరమిచ్చి వెళ్ళాడు.

ఒకనాడు, హిమాలయాలలోని సదానందముని, అపూర్వుణ్ణి దగ్గరికి పిలిచి, "నాయనా, నీకు పూర్వం, మహానుభావులైన ఎందరో మునులూ, యోగులూ కఠినమైన తపస్సు ఆచరించి యోగవిద్యలెన్నిటినో అభ్యసించి, పరిపూర్ణత సాధించారు. వాటినే నువ్వు మళ్ళీ ఇప్పుడు ఆచరించవలసిన అవసరం లేదు. అయితే, విశిష్టమైన కర్తవ్యాన్ని నిర్వర్తించవలసిన ముఖ్యమైన బాధ్యత నీకున్నది. నేను సాధించిన యోగశక్తిలో కొంత నీకు ప్రసాదిస్తున్నాను. దానిని నువ్వు మానవజాతి అభ్యుదయానికి ఉపయోగించాలి!" అన్నాడు.

"నేను మొదటినుంచి చేస్తున్నది అదే కదా! తమ కోరికకు భిన్నంగా ప్రవర్తించి, నేను తమకు నిరాశ కలిగించలేదుకదా!" అన్నాడు అపూర్వుడు వినయంగా.

"లేదు. నాయనా, నా సంకల్పాలన్నిటినీ నువ్వు నెరవేర్చావు. నిన్ను చూస్తూంటే ఆనందంగా ఉన్నది!" అన్నాడు ముని.

"ధన్యుణ్ణి, మహాత్మా! ప్రస్తుతం రాజ్యంలో అన్నీ సవ్యంగానే సాగుతున్నవి. చిన్న చిన్న సమస్యలున్నాయి. అయితే, ప్రజలే వాటిని పరిష్కరించుకోవాలి. మానవ జీవితంలో ప్రయత్నం ప్రధానం కదా! పోరాడితేగాని అభివృద్ధి సాధించలేమన్న విషయం మీకు తెలియనిదా, మహాత్మా!" అన్నాడు అపూర్వుడు.

"నీ వన్నది నిజమే. అయినా, మానవస్వభావం చాలా క్లిష్టమైనది. శాంతియుతంగా జీవితం సాగించడం కొందరికి సాధ్యపడదు. ఎప్పుడూ, ఏదో ఒక సమస్య కావాలి. అప్పుడుగాని అలాంటి వాళ్ళకు నిద్రపట్టదు!" అన్నాడు ముని.

అపూర్వుడు మునికేసి, ఆదుర్దాగా చూస్తూ, "అంటే, అలాంటి వ్యక్తులెవరైనా ప్రస్తుతం దురాగతాలకు పూనుకుంటున్నారా?" అని అడిగాడు.

''అవును, నాయనా, అలాంటి వాళ్ళు. నువ్వు మంచి మార్గానికి మళ్ళించిన బంది పోట్లూ, సముద్రపుదొంగలకన్నా అపాయ కరమైనవాళ్ళు. బందిపోట్లూ, దొంగలూ మామూలు మనుషులు. అయితే, ఇప్పుడు నేను చెబుతూన్న వ్యక్తులు సమాజంలో పెద్ద మనుషులు. కొందరికి కావలసినంత అధికార బలం వున్నది. మరికొందరికి అత్యధికమైన ధన బలం ఉన్నది. ఇంకా కొందరికి అపరిమితమైనబుద్ధిబలంకూడా ఉన్నది!'' అన్నాడు ముని నిట్టూరుస్తూ.

''వాళ్ళు ఇప్పుడేం చేయనున్నారు?'' అని అడిగాడు అపూర్వుడు ఆదుర్దాగా.

''ఆ సంగతి నువ్వే కనిపెట్టాలి. నేనొక సారి మానవజాతి భవిష్యత్తు గురించి ఆలోచిస్తూ, అలాగేధ్యానావస్థలోకి వెళ్లాను. అప్పుడు నా దివ్యదృష్టికి ఒక దృశ్యం గోచరించింది. ఇద్దరు పెద్దమనుషులు ఏదో అపవిత్ర కార్యం గురించి రహస్యంగా ఆలోచించడం తెలియవచ్చింది. ఆ ఇద్దరిలో ఒకరిని మాత్రం నేనెరుగుదును. అతడు రుద్రపురి ప్రధాన మంత్రి. వారిరువురూ రేపురాత్రికి మళ్ళీ రహస్యాలోచన జరుపనున్నట్లు తెలిసింది. కాని, వాళ్ళ పథకం వివరాలు తెలియలేదు. నువ్వు ప్రధానమంత్రి ఇంటికి వెళ్ళి, అక్కడి పరిస్థితుల గురించీ, వాళ్ళ దుష్టపథకం



గురించీ తెలుసుకోవాలి!'' అని చెప్పి సదానందముని అపూర్వుణ్ణి ఆశీర్వదించాడు.

* * *

సాయంకాలమయింది. రుద్రపురిలోని దేవాలయాలలో గంటానాదాలూ, శంఖారావాలూ మారుమోగాయి. రాజప్రాసాదానికీ, ప్రధానమంత్రి భవనానికీ మధ్య బ్రహ్మాండమైన వటవృక్షం ఒకటి ఉన్నది. ఆ వటవృక్షం కొమ్మల చాటున దాక్కున్న అపూర్వుడు, ప్రధానమంత్రి భవనంలోకి ప్రవేశించడానికి అవకాశంకోసం ఎదురు చూస్తున్నాడు.

రాజప్రాసాదం ముందు కొందరు ఆనందోత్సాహాలతో ఏవో మాట్లాడుకుంటూ



అటూ ఇటూ హడావుడిగా తిరుగుతున్నారు. అటుగా వచ్చిన ఒక వ్యక్తి, ఎదురుపడిన రాజోద్యోగిని, "ఏమిటి విశేషం? ఎందుకీ హడావుడి?" అని అడిగాడు.

"మన యువరాణి కృష్ణకుమారిగారు లావణ్యపురినుంచి తిరిగివస్తున్నారు. ఆమె తన మేనమామ లావణ్యపురి రాజు జయవర్మ దగ్గరికి వెళ్ళి ఆరునెలల తరవాత ఇప్పుడే వస్తున్నారు. అందుకే ఈ కోలాహలం!" అన్నాడు రాజోద్యోగి.

మరి కొంతసేపటికి చక్కగా అలంకరించిన అందమైన ఏనుగు అంబారీ మీద, బంగారు గొడుగు నీడన యువరాణి కృష్ణకుమారి రాజప్రాసాదాన్ని సమీపించింది. ఆమె ఎక్కిన ఏనుగుకు ముందూ, వెనకా రెండు ఏనుగుల మీద నలుగురేసి చెలికత్తెలు కూర్చున్నారు. ఏనుగులకు ముందూ, వెనకా ఇరువైపులా గుర్రాలమీద రక్షకభటులు వచ్చారు.

ముందు చెలికత్తెలు దిగి, యువరాణి వున్న ఏనుగు దగ్గరికి వెళ్ళారు. మావటివాడి సూచన ప్రకారం, యువరాణి ఏనుగు మెల్లగా కిందికి వంగింది. భటులు ఒక మెత్తటి ఆసనాన్ని తెచ్చి ఏనుగు పక్కన వేశారు. యువరాణి ఆసనం మీదికి దిగి, ఆ తరవాత నేలపై అడుగుపెట్టింది.

అప్పటికే అక్కడికి చేరిన రాజు విశ్వవర్మ మందహాసంతో కుమార్తెకు ఎదురు వచ్చాడు. తండ్రి కనిపించగానే యువరాణి అనురాగంతో చేతులు సాచింది.

"రా, తల్లీ," అంటూ రాజు ఆమెను ఆప్యాయంగా పలకరించాడు.

యువరాణి కృష్ణకుమారి రుద్రపురి రాజు విశ్వవర్మ ఏకైక సంతానం. యువరాణి పసిపాపగా ఉన్నప్పుడే తల్లి మరణించింది, కాని, రాజు ఆ తరవాత వివాహమాడడానికి అంగీకరించలేదు. రుద్రపురికి పొరుగు రాజ్యమైన లావణ్యపురి రాజు జయవర్మ, యువరాణికి మేనమామ. ఆయనకు సంతానం లేదు. కాబట్టి ఆయన తన సోదరి కుమార్తెను తన కుమార్తెలా

భావించసాగాడు. సోదరి మరణించడంతో ఆ అభిమానం ఇనుమడించింది. అందు వల్ల ప్రస్తుతం యువరాణి కృష్ణకుమారి ఇరుగుపొరుగు రాజ్యాలయిన రుద్రపురికీ, లావణ్యపురికీ ఏకైక వారసురాలు! మేనమామ జయవర్మను తండ్రిలాగానూ, లావణ్యపురిని తన సొంత రాజ్యంలాగానూ ఆమె భావిస్తుంది. అందుకే అక్కడ ఆరు నెలలు గడిపి తిరిగివస్తున్నది!

యువరాణి మెడలో ముత్యాలహారం మధ్య మిరమిట్లు గొలుపుతూన్న అద్భుత మణిని చూసి, రాజు, "ఏమిటిది?" అని అడిగాడు అమితాశ్చర్యంతో.

"నేను లావణ్యపురి నుంచి మరింత సంపన్నురాలిగా తిరిగివచ్చాను, నాన్నా!" అన్నది యువరాణి.

రాజు ఆమె కంఠహారంలోని మణిని చేతితో తాకి, పరిశీలనగా చూస్తూ, "ఇది అద్భుతమైన చంద్రకాంతమణి కాదు కదా?" అని అడిగాడు.

"అవునునాన్నా, ఇదిచంద్రకాంతమణే. దీనిని ఎంతకాలమని అలంకరించుకోకుండా ఖజానాలో దాచడం? పైగా, ఇప్పుడు మన రెండు రాజ్యాలలోనూ, శాంతి భద్రతలకు లోటు లేదు. అందువల్ల, ఇదే శుభతరుణంగా భావించి, మామ చంద్రకాంతమణితో ఒక ప్రత్యేక హారం



చేయించి నా మెడలో వేశాడు. బావుందా నాన్నా!" అని అడిగింది యువరాణి.

"మీ మామ చాలా గొప్పవాడు తల్లీ," అంటూ రాజు యువరాణిని ఆప్యాయంగా దగ్గరికి తీసుకున్నాడు.

* * *

"ఇన్నాళ్ళూ నీకంటబడకుండా దూరంగా వున్న అదృష్టం, ఇప్పుడు నిన్ను సమీపించనున్నది. చేయిసాచి అందుకోవడమే తరువాయి!" అన్నాడు మాంత్రికుడు పరమానందంతో.

ప్రధాని మౌనంగా వింటున్నాడు.

"అయితే, అదృష్టం దానంతట అదే నీ దగ్గరికి వచ్చిందనుకుంటున్నావేమో!



''జయవర్మకుగాని, విశ్వవర్మకుగానీ, చంద్రకాంతమణి గొప్పదనం తెలియక పోవడం మన అదృష్టం. ప్రపంచంలోని విలువైన మణులలో అదొక్కటి అన్న విషయం మాత్రమే వాళ్ళకు తెలుసు. ఆ మణి అద్భుతశక్తులను గురించి వాళ్ళ కేమాత్రం తెలియదు,'' అని బిగ్గరగా నవ్వబోయి, చప్పున ఆపుకున్నాడు మాంత్రికుడు.

దాదాపు గంటసేపు వాళ్ళిరువురు రహస్య ఆలోచనలు జరిపారు. వాళ్ళ సంభాషణలు విన్న అపూర్వుడికి అక్కడి విషయాలన్నీ అర్థమయ్యాయి. ప్రధాన మంత్రీ, మాంత్రికుడూ చిన్ననాటి స్నేహితులు. బాల్యంలో వాళ్ళిద్దరూ ఒకే గురుకులంలో ఒకే గురువు వద్ద విద్యనభ్యసించారు. వాళ్ళ గురువుకు గురువు, అద్భుతశక్తులు గల చంద్రకాంతమణిని, ఆనాటి లావణ్యపురి రాజైన ఈనాటి జయవర్మ తాతకు బహూకరించాడు. ఆ రోజు నుంచి మూడు తరాలుగా, లావణ్యపురి రాజకుటుంబానికి చెందిన ఖజానాలోనే ఆ చంద్రకాంతమణి పడి ఉన్నది!

మాంత్రికుడు ఒకనాడు ప్రాచీన తాళపత్ర గ్రంథాలను పరిశీలిస్తుండగా ఒక రహస్యం బయటపడింది. చంద్రకాంతమణి అద్భుతశక్తులు గలదనీ, దానిని

అది నిజం కాదు. నేను నా మంత్రశక్తిని ప్రయోగించాను. లావణ్యపురి రాజు మనసు మార్చాను. ఆయనకు తెలియకుండానే, ఆయన మనసులో, చంద్రకాంతమణిని యువరాణి కృష్ణకుమారి మెడలో వేయాలన్న కోరికను పుట్టించాను,'' అన్నాడు మాంత్రికుడు గర్వంగా మునివేళ్ళతో గడ్డం దువ్వుకుంటూ.

''అలాగా! మీ శక్తిని నేనెరుగుదును మహాత్మా!'' అన్నాడు ప్రధానమంత్రి.

మాంత్రికుడు మహాత్ముడా? పరమ దుర్మార్గుడు! అనుకున్నాడు చాటునుంచి వాళ్ళ సంభాషణలు వింటూన్న అపూర్వుడు.

ధరించి, కొన్ని ప్రత్యేకపూజలు జరిపినట్ట యితే, రాజులందరికీ చక్రవర్తి కావచ్చు నన్న విషయం తెలిసింది. ఆ క్షణం నుంచి, ఆ చంద్రకాంతమణిని ఎలాగైనా తన కైవసం చేసుకోవాలని మాంత్రికుడు తెగ ఆలోచిస్తున్నాడు. వాడు లావణ్యపురి రాజు జయవర్మను దర్శించి, యువరాణి కృష్ణకుమారి దుష్టశక్తి ప్రభావానికి లోనై వున్నదనీ, ఆమెను రక్షించుకోవాలంటే, ఆమె మెడలో విలువయిన మణిహారం వేయాలనీ చెప్పాడు. మేనకోడలి మీది అభిమానం కారణంగా, జయవర్మ వెంటనే, చంద్రకాంతమణి పొదిగిన హారాన్ని ఆమె మెడలో వేశాడు. అయితే, ఆయన దుష్టశక్తి ప్రభావం విషయం ఆమెకు చెప్పలేదు.

తన మంత్రశక్తిని ప్రయోగించి జయ వర్మ మనసులో మార్పు తెచ్చాననీ, అందుకే ఆయన విలువయిన చంద్ర కాంతమణిని వదులుకోవడానికి సిద్ధపడ్డా డనీ, మాంత్రికుడు ప్రధానమంత్రికి కల్పించి చెప్పాడు. మంత్రి ఆ మాటలు నమ్మాడు. మంత్రవేత్త అయిన తన స్నేహితుడి సహాయంతో, తాను గొప్ప చక్రవర్తి కావాలని, ప్రధాని కలలు కన సాగాడు. అయితే, చంద్రకాంతమణి చేతికి రాగానే, ప్రత్యేకపూజలు చేయించా లన్న సాకుతో దానిని అపహరించి, తనే చక్రవర్తి కావాలని మాంత్రికుడు పథకం వేశాడన్న సంగతి ప్రధాని గ్రహించలేక పోయాడు!

మనుషుల కళ్ళలోకి చూసి వారి స్వభావాలను తెలుసుకోగలశక్తి అపూర్వు డికి ఉన్నది. ప్రధానమంత్రి మూర్ఖుడే కాని, మాంత్రికుడు కరుడుగట్టిన స్వార్థ పరుడనీ, తన స్వార్థం కోసం ఎంతకైనా తెగించగల దుర్మార్గుడనీ అపూర్వుడు గ్రహించాడు. అటువంటి దుర్మార్గుడు చక్రవర్తి అయితే, మానవజాతి మనుగడ ఏమవుతుంది? మంచివాళ్ళ భవిష్యత్తు ఏమవుతుంది? అని అపూర్వుడు ఆలో చించసాగాడు. —(ఇంకావుంది)





# ఘనతనివ్వని అర్హత

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు పడుతున్న ఇంత శ్రమకూ కారణం ఏమై వుంటుందో అర్థం కావడం లేదు. ఒక దేశాన్ని పాలించే మహారాజువైన నువ్వు, మరింతగా ఏదో సాధించాలన్న స్వార్థబుద్ధితో, ఈ అర్ధరాత్రివేళ శ్మశానంలో తీరని ఇక్కట్లకు గురి అవుతున్నావనుకోవడం పొసగదు. నువ్వు భక్తి గౌరవాలతో ఆరాధించే గురువో లేక ముని లాంటి వాడో, నిన్నీపనికి పురిగొల్పివుండవచ్చు. కాని, అలాంటివారిలో కొందరికి హేతుబద్ధంగా ఆలోచించడం, నిశ్చితబుద్ధీ లాంటివి వుండవు. ఒకవేళ అలాంటివాళ్ళ కోసం నువ్వీన్ని శ్రమలకోర్చుతూంటే

## బేతాళ కథలు



మాత్రం, చివరకు ఆశాభంగానికి గురి కాగలవు. విశ్వామిత్రుడనే ఒక ముని సమానార్హతలుగల తన శిష్యులైన ఇద్దరి పట్ల, నిర్హేతుకంగా అభిమాన దురభిమానాలను ప్రదర్శించిన తీరు గురించి చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒక మహారణ్యంలో విశ్వామిత్రుడనే ముని వుండేవాడు. ఆయన వద్ద ఎందరో శిష్యరికం చేస్తూండేవారు. ముని వారందరికీ తపోవిధానం గురించీ, మోక్షసాధనం గురించీ ఉపదేశిస్తూండేవాడు.

విశ్వామిత్రుడి శిష్యుల్లో లోకప్రియుడు, శక్తికిరణుడు అనే వాళ్ళిద్దరు తపోబలంతో ఎన్నో అద్భుత శక్తులు సాధించి, అందరిలో అగ్రగణ్యులయ్యారు. ముని వారిద్దరినీ ఒక రోజున దగ్గిరకు పిలిచి, "మీరిద్దరూ నా శిష్యుల్లో ముఖ్యులు, ఉత్తములు. ఇక మీరిక్కడ నేర్చుకోవలసింది లేదు. మీరిప్పుడు ఇళ్ళకు తిరిగి వెళ్ళండి. సంసారజీవితం గడపండి. మీ బాధ్యతలను సక్రమంగా నిర్వహించాక, వృద్ధాప్యంలో ఇక్కడికి వచ్చి తపస్సు కొనసాగించండి. ఇప్పుడు మీది మోక్షం కోసం తపస్సు చేసే వయసు కాదు," అని చెప్పాడు.

శిష్యులిద్దరూ సరేనన్నారు. అయితే వాళ్ళిద్దరూ కూడా ఏకకంఠంతో, "గురువర్యా! మా ఇద్దరికీ ఇప్పుడు అద్భుత శక్తులున్న కారణంగా, సామాన్య మానవులు ఇబ్బందిపడే అవకాశం వున్నది. మాకు శాపమివ్వడమే తప్ప శాపవిమోచన మార్గం తెలియదు. పొరబాటున ఎవరినైనా శపిస్తే, వారిని శాపవిముక్తుల్ని చేయడం కూడా మా బాధ్యత. మాకా శక్తిని కలిగించండి," అన్నారు.

విశ్వామిత్రుడు శిష్యులను తనవద్ద మరొక నెల రోజులుండమన్నాడు. రెండు వారాలు గడిచాక ఆయన శక్తికిరణుడితో, "శాపవిమోచన శక్తికోసం ఎంతో కష్టమైన ఉపాసన చేయాలి. అది అందరికీ సాధ్య

పడేది కాదు. నీకా ఉపాసనా మార్గం చెబుతాను," అన్నాడు.

శక్తికిరణుడు ఎంతో సంతోషించి ఉపాసన ప్రారంభించాడు. వాడు ఉపాసన చేస్తూండగానే విశ్వమిత్రుడు, లోకప్రియుడితో, "నాయనా! నీవిక్కడ వుండడం వృథా. ఏ విద్యకైనా నేను అర్హతలు చూసుకుంటాను. నీకు శాపవిమోచన మార్గం ఉపదేశించలేకపోతున్నాను. కాబట్టి నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి," అని హెచ్చరించి పంపేశాడు.

శక్తికిరణుడు శాపవిమోచన ఉపాసనా దీక్షపూర్తిచేసుకుని, తనూ ఇంటికి వెళ్లాడు.

అలా అయిదు సంవత్సరాలు గడిచాయి. ఒక రోజున, ఆ దేశాన్ని పాలించే మహారాజు మాన్యసేనుడి నుంచి, విశ్వమిత్రుడికి కబురు వచ్చింది. రాజు పంపిన రథంలో ఆయన రాజధానికి వెళ్ళాడు.

విషయమేమిటంటే — మాన్యసేనుడు సమర్థుడైన రాజగురువు గురించి అన్వేషిస్తున్నాడు. అందుకు తగినవారు లోకప్రియుడు, శక్తికిరణుడు మాత్రమేనని అంతా చెప్పారు. అప్పటికే శక్తికిరణుడు మహాశక్తివంతుడుగా దేశమంతటా పేరు గాంచాడు. అతడి కారణంగా, అన్యాయం చేసేవాళ్ళందరి మనసుల్లోనూ బెదురుపుట్టి సక్రమమార్గంలో నడుస్తున్నారు. శక్తికిరణుడివద్ద వందలాది శిష్యులున్నారు. వారిలో కొందరు శక్తిసేనగా ఏర్పడి దేశంలోని దుర్మార్గులను





వేటాడుతున్నారు. వాళ్ళ గురువు శక్తి కిరణుడు శపిస్తాడన్న భయంతో, దేశంలో శక్తిసేన నెదిరించేవారు లేరు.

లోకప్రియుడు, శక్తికిరణుడంతగా పేరు తెచ్చుకోలేదు. అతడివద్ద చాలా కొద్దిమంది శిష్యులున్నారు. అతడు తరచుగా ప్రజలమధ్యకు వెళ్ళి తత్త్వోపదేశం చేస్తూంటాడు. ప్రజలకు చక్కని కథలు చెప్పి, వారి మనసులను మంచి మార్గం వైపు తిప్పుతున్నాడు. ప్రజల్లో అతడికి గౌరవముంది కానీ, అతడికున్న అద్భుతశక్తుల గురించి ఎవరికీ తెలియదు.

మాన్యసేనుడు, శక్తికిరణుడిని రాజగురువు చేద్దామనుకున్నాడు. అయితే శక్తికిరణుడు రాజుకు, లోకప్రియుడిని గురించి చెప్పి, "మేమిద్దరం అన్నింటా సరిసమానులం. మా ఇద్దరిలో రాజగురువు కావలసినవారెవరో, మా గురువు విశ్వమిత్రు డొక్కడే చెప్పగలడు. ఆయన అనతి లేనిదే మేమిద్దరమూ కూడా దేనికీ అంగీకరించం," అని వినయంగా చెప్పాడు.

రాజు చెప్పగా విశ్వమిత్రుడిదంతా విని, "నా శిష్యులిద్దరూ సరిసమానులన్న మాట నిజం కాదు. ఇద్దరిలోనూ సర్వసమర్థుడు లోకప్రియుడు. వాడే రాజగురువు కావాలని నా అభిమతం," అన్నాడు.

మాన్యసేనుడు, విశ్వమిత్రుడు చెప్పినట్లే చేశాడు. గురువు శాసించడంవల్ల, లోకప్రియుడు రాజగురువు కావడానికి అంగీకరించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మొదటి నుంచీ తన ఇద్దరు శిష్యులపట్ల, ముని విశ్వమిత్రుడి ప్రవర్తన క్రమబద్ధంగా లేదని తెలుస్తూనే వున్నది కదా! మొదట్లో ఆయన లోకప్రియుణ్ణి కాదని, శక్తికిరణుణ్ణి అభిమానించి, అతడికి శాపవిమోచనశక్తికి అవసరం అయిన ఉపాసనా మార్గం బోధించాడు. ఆ తర్వాత రాజగురువు పదవీ సమస్య వచ్చినప్పుడు,

అతణ్ణి తోసిపుచ్చి, లోకప్రియుడు అందుకు అర్హుడన్నాడు. ఇదంతా విశ్వమిత్రుడి అనాలోచిత ధోరణినీ, హేతురహితమైన అభిమాన దురభిమానాలనూ తెలియపర చడం లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''లోకంలో ఘనత నివ్వని అర్హతలు గలవాళ్ళు ఎందరో వున్నారు. అన్ని అర్హతలూ ఘనత నివ్వవు. సామాన్యులకు కీర్తి కాంక్ష వుంటుంది. తన అద్భుత శక్తుల్ని ప్రద ర్శించి కీర్తిని పొందజూసిన శక్తికిరణుడు సామాన్యుడు. తనకు అద్భుతశక్తులుండీ ఎవరికీ చెప్పని లోకప్రియుడు నిస్సందే హంగా అసామాన్యుడు. శాపం విషయంలో నిగ్రహానుగ్రహశక్తులు, శక్తికిరణుడికున్న మాట నిజం. శాపాన్ని ఉపసంహరించు కునే శక్తి లోకప్రియుడికి లేని మాట కూడా నిజం. తన శిష్యులిద్దరిలో ఎవరు ఘనతకు అర్హులో, ముని విశ్వమిత్రుడు ఎంతో హేతుబద్ధంగా ఆలోచించి నిర్ణయించాడు. అందులో అభిమాన దురభిమానాలకు తావు లేదు. వాస్తవమేమంటే—శపించే గుణమున్నవాడికే, దాని విమోచన మార్గం తెలుసుకునే అవసరం వుంటుంది. జ్ఞానంలో పరిపూర్ణుడైన వాడికి కోపంరాదు. కోపం లేనివాడు శాపాలివ్వడు, పాపాలు చేయడు, పొరబాటుపడడు. ఇది ఎరిగిన వాడు కనకనే, విశ్వమిత్రుడు, లోక ప్రియుడికి శాపవిమోచనం గురించి తెలుసుకోవలసిన అవసరంలేదని నిర్ణయిం చాడు. శాపవిమోచనంఇవ్వగల శక్తికోసం, శక్తికిరణుడు పూనిన ఉపాసనా దీక్ష, అతడి తక్కువతనాన్నే తప్ప గొప్పతనాన్ని తెలియజేయదు. ఈ కారణాలవల్లనే ముని, రాజగురువు పదవికిలోక ప్రియుడు అర్హుడని నిర్ణయించాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]





# సకిలింపుమాన్యం

గౌతమపురం అనే గ్రామంలో, సోమన్న అనే ఒక రైతు వుండేవాడు. అతడికి పదహారేళ్ళ వయసువాడైన కన్నప్ప అనే కొడుకుండేవాడు. వాడు పొలం పనుల్లో తండ్రికి ఏమాత్రం సాయం చేయకుండా, గ్రామంలో జులాయిలా తిరుగుతూండేవాడు.

ఒకనాడు సోమన్న, కొడుకుతో, "ఒరే, తిని కూర్చుంటే కొండలైనా తరిగి పోతాయి. ఏదైనా పని నేర్చుకుని, డబ్బు సంపాయించే మార్గం ఆలోచించు," అన్నాడు.

"అయితే, ఆ పనేదో నువ్వే చెప్పు!" అన్నాడు కన్నప్ప కోపంగా.

"మన జొన్నచేను కోతకొస్తున్నది. అక్కడ కాపలాకైనా వుండు. నీకు అదేమంత కష్టమైన పని కాదు," అన్నాడు సోమన్న.

కన్నప్ప సరేనని పొలం కాపలాకు వెళ్ళాడు. అయితే, అక్కడ వాడికేమీ తోచిందికాదు. ఉబుసుపోక వాడు అక్కడ ఎగిరే పక్షుల కూతల్నీ, ఆ ప్రాంతాల తిరిగే జంతువుల అరుపుల్నీ అనుకరించసాగాడు. కొద్దిరోజులు గడిచేసరికి వాడు ఆ అనుకరణలో ఎంత ప్రావీణ్యంసంపాదించాడంటే—పక్షులూ గాడిదా, గుర్రాల్లాంటివి వాడి గొంతుకను స్వజాతిగానే భావించి, తిరిగి ప్రతిధ్వనులు చెయ్యసాగినై.

కన్నప్ప చేసే పని క్రమంగా వినోదంగా మారి, చుట్టుపక్కల పొలాలలో కాపలా వుండేవాళ్ళు, వాడి చుట్టూ చేరి కాలక్షేపం చేయసాగారు.

గౌతమపురం, సిరిపురం జమీందారుగారి జమీగ్రామాల్లో ఒకటి. జమీందారుకు గుర్రపుస్వారీ అంటే ఎక్కడలేని సరదా.

జె. ఉదయనాగశిరీష

ఆయన ప్రతి దసరారోజుల్లో పాతగుర్రాన్ని ఎవరికైనా దానం చేసి, కొత్తగుర్రాన్ని ఎక్కి ఉత్సాహంగా గ్రామాల వెంట తిరుగుతూ రైతుల యోగక్షేమాలు విచారిస్తూండేవాడు.

ఆ పద్ధతి ప్రకారం, ఈసారి ఆయన కొన్న గుర్రం చూడడానికి చాలా అందంగా వుండేదికాని, ఒట్టి పెంకెది; పొగరు బోతుది.

ఒకనాటి ఉదయం వేళ జమీందారు, ఆ గుర్రం మీద స్వారీ అయి, మధ్య మధ్య దాన్ని అదుపులో వుంచడానికి నానాతంటాలూ పడుతూ గ్రామాల వెంట బయలుదేరాడు. అయితే, చివరకది ఆయనకేమాత్రం లొంగకుండా ఇష్టం వచ్చినట్టు దౌడుతీస్తూ గౌతమపురం వచ్చింది.

గ్రామప్రజలు గుర్రాన్ని పట్టుకుని, జమీందారు కింద పడకుండా రక్షిద్దామనుకుని, దానికి అడ్డం పోయారు. కాని గుర్రం వాళ్ళను వెనకకాళ్ళతో తన్నుతూ, పెద్దగా సకిలిస్తూ గ్రామం దాటి పంట పొలాలకు అడ్డం పడి వేగంగా పరిగెత్త సాగింది.

జమీందారు భయంతో వణికిపోతూ, గుర్రం కళ్ళెపుతాళ్ళతోపాటు దాని జూలు కూడా బిగించి పట్టుకుని, "భీమా, ఆగు! భీమా, ఆగు!" అంటూ అరవసాగాడు.

జొన్న చేనులో వుండి, జమీందారు పరిస్థితి గమనించిన కన్నప్ప, పరుగు



పరుగునపోయి దాపులనున్న పొదల చాటున కూర్చుని, గుర్రం సకిలింపును అనుకరిస్తూ బిగ్గరగా అరవడం ప్రారంభించాడు. అది విన్న గుర్రం మరుక్షణమే చప్పున పరుగు ఆపి, తిన్నగా పొదల ధగ్గిరకు పోయి నిలబడి తనూ సకిలించసాగింది.

జమీందారు బతుకు జీవుడా అనుకుంటూ గుర్రం దిగి, తనను కాపాడిన మరొక గుర్రం ఎక్కడున్నదా అని, పొదలకేసి చూడసాగాడు. ఇంతలో గ్రామస్థులు కొందరు అక్కడికి చేరారు. కన్నప్ప పొధల చాటు నుంచి బయటికి వచ్చాడు.

కన్నప్ప కేసి జమీందారు ఆశ్చర్యంగా చూస్తూన్నంతలో, సోమన్న ముందుకు వచ్చి, చేతులు జోడించి, "అయ్యా, తమరంత ఆశ్చర్యపడకండి! ఇలాంటి పనికిమాలిన కూతలు కూస్తూ, పనీపాటా లేకుండా తిరుగుతున్న వీడు, నా కొడుకు కన్నప్ప," అన్నాడు.

ఇది విన్న జమీందారు మరింత ఆశ్చర్యంగా, "ఆహాఁ, అద్భుతం! ఇది పనికిమాలిన కూతకాదు. నోరు లేని భీముడంతటి పొగరుబోతు గుర్రాన్ని నిలపగలిగిన గొప్ప అనుకరణ విద్య. గొప్ప జాతకులకు తప్ప, ఇది అందరికీ అలవడే సామాన్య విద్య కాదు. ఈ కన్నప్పను మెచ్చాను. అదుగో, ఆ చెరువు కట్ట నుంచి, ఈ కనబడే కాలవ మధ్యలో వున్న పొలాన్నంతా వీడికి మాన్యంగా ఇస్తున్నాను. ఈ విద్యను వీడు మరింతగా అభివృద్ధి చేసుకోవడం అవసరం. వచ్చే ఏటి దసరారోజుల్లో నేను ఏనుగు మీదే ఇటుగా రావచ్చు," అన్నాడు.

ఈ విధంగా కన్నప్పకు, జమీందారు నుంచి లభించిన పొలాన్ని నలుగురూ సకిలింపు మాన్యం అనసాగారు. కన్నప్ప ద్వారా అనుకరణ విద్య నేర్చుకున్న వాళ్ళు, తమ మొదటి ప్రదర్శనాన్ని, ఆ సకిలింపు మాన్యంలో ఇవ్వడాన్ని ఆచారంగా చేసుకున్నారు.



# చందమామ

## అనుబంధం—38



మన దేవుళ్ళు:

## గౌతమబుద్ధుడు

ఈనాటి ఉత్తరప్రదేశ్—నేపాల్ సరిహద్దులలోని కపిలవస్తు రాజకుటుంబంలో సిద్ధార్థుడు క్రీ. పూ. 566 వ సం॥లో జన్మించాడు. ప్రపంచంలోని బాధలను చూసి, విముక్తిమార్గం కనుగొనడానికి భార్యాబిడ్డలనూ, రాజభోగాలనూ త్యజించి, సన్యాసం స్వీకరించి అనేక సంవత్సరాలు కఠినమైన తపస్సులో గడిపాడు. జ్ఞానోదయమైన తరవాత గౌతమబుద్ధుడుగా ప్రసిద్ధిగాంచాడు. క్రీ. పూ. 566 వ సం॥ నుంచి 486 వరకు జీవించిన గౌతమబుద్ధుడు ప్రజలకు, తాను కనుగొన్న మంచి మార్గాన్ని బోధించాడు.

మనిషిలోని ఆశలే ప్రపంచంలోని బాధలన్నిటికీ మూలం. ఆశలను జయించినప్పుడే మనిషి దుఃఖం నుంచీ, జనన మరణాల నుంచీ విముక్తి పొంది నిర్వాణం సాధించడం సాధ్యం—అని గౌతమబుద్ధుడు బోధించాడు.

కొంతకాలానికి హిందువులు—మహావిష్ణువు అవతారాలలో ఒకటిగా బుద్ధావతారాన్ని భావించసాగారు. ఈనాడు ప్రపంచ జనాభాలో మూడోవంతు ప్రజలు బౌద్ధ మతాన్ని అవలంబిస్తున్నారు.

## వార్తలలో బాలలు:

# పిన్నవయసు క్రీడాకారులు!

కలకత్తా నగరపౌరులు, గత జూలై నెలలో ఎనిమిదేళ్ళ విద్యార్థికి ఘనస్వాగతం ఏర్పాటు చేశారు. సూర్యశేఖర్ గంగూలీ అనే అ ఎనిమిదేళ్ళ కుర్రవాడు, పోలండ్ దేశంలోని వార్సాలో జరిగిన వరల్డ్ సబ్ జూనియర్ చెస్ చాంపియన్‌షిప్‌లో కాంస్యపతకాన్ని గెలుపొందాడు. అ విద్యార్థి పదకొండు రౌండ్లలో ఎనిమిది పాయింట్లు సాధించాడు. బంగారు పతకం 8.5 పాయింట్లు సాధించిన లెరాస్ యాంద్రియాకు (ఫ్రాన్స్) లభించింది. వెండిపతకం పాకోవాలేకాకు లభించింది. అతడు కూడా 8 పాయింట్లే సాధించాడు; కాని ఆటలో క్రమబద్ధమైన అభివృద్ధినీ, వేగాన్నీ చూపాడు!

పోటీలు జరిగిన రెండవ రోజున, ప్రపంచ చాంపియన్ గ్యారీ కాస్పరోవ్—సూర్య పక్కనే నిలబడి, అతడు 16 ఎత్తులలోనే తన ప్రత్యర్థిని చిత్తుగా ఓడించిన వైనాన్ని ఆసక్తితో చూశాడు. కాస్పరోవ్ కోచ్, ఎడ్డీగ ఫెల్ఘ్, సూర్యాను చూసి—ఇతడు మరో 10, 12 సంవత్సరాలలో ప్రపంచ చాంపియన్ షిప్ కోసం ఆడే అవకాశం వుంది, అని చెప్పాడు.



కలకత్తాలోని స్కాటిష్ చర్చ్ కలెజియేట్ స్కూల్లో మూడవ తరగతి చదువుతూన్న సూర్యశేఖర్ తండ్రి పంకజ్ గంగూలీ వృత్తిరీత్యా జ్యోతిష్కుడు. తన కుమారిడి క్రీడాసక్తికీ, విజయానికీ, సానుకూలంగా వున్న తారాబలమే కారణమని ఆయన విశ్వాసం. సూర్య తల్లి ఆర్తి. తల్లివైపు పెద్దలు పలువురు చదరంగపు ఆటగాళ్ళే. తల్లివైపు తాతయ్యా అనిల్‌బాసు మల్లిక్—సూర్యాకు మూడేళ్ళ ప్రాయంలోనే చదరంగంపట్ల ఆసక్తిని కలిగించి, శిక్షణ నివ్వసాగాడు. సూర్య అయిదోయేట నుంచి పోటీలలో పాల్గొనడం ప్రారంభించాడు. ఇంతవరకు సూర్య, 27 రాష్ట్రస్థాయి పోటీల లోనూ, 37 జాతీయ స్థాయి పోటీలలోనూ, రెండుసార్లు ఆలిండియా ఓపెన్ టోర్నమెంట్‌లోనూ పాల్గొన్నాడు. అంతర్జాతీయ స్థాయిలో వార్సాలోనే ప్రప్రథమంగా పాల్గొన్నాడు.

4 అడుగులా, 2 అంగుళాల పొడవున్న సూర్యాకు ఫుట్‌బాల్ అన్నా, క్రికెట్ అన్నా ఎంతో ఇష్టం. అన్ని క్రీడలపట్లా ఆసక్తి కనబరుస్తున్నాడు. లెక్కలంటే అభిమానమేగాని, బైబిల్ పాఠాలను మరీ ఇష్టంగా చదువుతాడు. బైబిల్‌ను కథలపుస్తకంలా తరచూ చదువుతూ వుంటాడు. అద్భుతమైన జ్ఞాపకశక్తి ఉన్నది. వేగంగా లెక్కలు వేయడంలో కంప్యూటర్ లాంటి వాడని పరిశీలకులు అభిప్రాయ పడుతున్నారు.

మన దేశంలోని ప్రపంచ జూనియర్ చాంపియన్‌లయిన దివ్యేంద్రబరూవా (1978) విశ్వనాథన్ ఆనంద్ (1987) లకు తగిన వారసుడు సూర్యశేఖర్ గంగూలీ!

# మీకు తెలుసా?

1. ప్రప్రథమంగా తేయాకును పండించిన దేశం ఏది ?
2. పాలు, మీగడ ఈ రెంటిలో ఏది ఎక్కువ బరువు ?
3. ఇస్లాం మతానికి ఆధారభూత మైన ' ఐదు స్తంభాలు 'గా వేటిని పేర్కొంటారు ?
4. ఖురానులో ఏసుక్రీస్తు ఏ పేరుతో ప్రస్తావించబడ్డాడు ?
5. క్రీస్తు అనే పేరు ఏమాట నుంచి వచ్చింది ?
6. ఏసుక్రీస్తుకు నదీజలంతో జ్ఞానస్నానం చేయబడింది. ఆ నది పేరేమిటి ?
7. ' బెథెల్‌హామ్ ' అన్న మాటకు అర్థం ఏమిటి ?
8. **అంతరిక్షంలోకి** వదలబడిన మొట్టమొదటి రష్యను ఉపగ్రహం పేరేమిటి ? ఎప్పుడు వదిలారు ?
9. క్రికెట్‌లో అత్యధికంగా ' సిక్సెస్ ' కొట్టిన క్రీడాకారుడెవరు ? ఆయన ఎవరి రికార్డును అధిగమించాడు ?
10. ఏ యుద్ధంలో మొట్టమొదట విషవాయువును ఉపయోగించారు ?
11. పాశ్చాత్య సంగీతానికి ' అధిష్ఠానదేవత 'గా ఎవరిని చెబుతారు ?
12. సిరాను మొట్టమొదట ఏ పరికరంతో ఉపయోగించారు ?
13. ఆసియాఖండంలోకెల్లా అతి పెద్ద ఎడారి ఏది ?
14. క్రిస్టఫర్ కొలంబస్ ఏదేశానికి చెందినవారు ?
15. నాణేలకు బదులు కాగితం డబ్బును ప్రవేశపెట్టిన మొట్టమొదటి దేశం ఏది ?

## సమాధానాలు

1. చైనా.
2. పాలు.
3. గాఢవిశ్వాసం, రోజూ ప్రార్థనలు, దానాలు చేయడం, రంజాన్ నెలలో ఉపవాసం, మెక్కా యాత్ర.
4. ఈసా.
5. ' క్రిస్టోస్ ' అనే గ్రీకు పదం; ' అభిషేకించబడిన వాడు '.
6. ఇజ్రాయెల్‌లోని జోర్డాన్‌నది.
7. దైవగృహము; అది ఏసుక్రీస్తు జన్మస్థానం.
8. స్పుట్నిక్. 1957 వ సం॥ అక్టోబర్ 4 వ తేదీన.
9. ఇయాన్ బోథామ్ (సోమర్‌సెట్) అతడు 1985లో 80 ' సిక్సెస్ ' కొట్టాడు. 1935 లో 66 ' సిక్సెస్ ' కొట్టిన ఆర్థర్ వెల్లార్డ్‌ను.
10. ప్రథమ ప్రపంచ యుద్ధసమయంలో (1913-18) జరిగిన మొదటి ఇప్రస్ పోరాటంలో.
11. సెయింట్ సిసీలియా.
12. పక్షి ఈక.
13. అరేబియా ఎడారి.
14. ఇటలీ.
15. చైనా.




## ఎవరెస్టు శిఖరం మీదుగా బెలూన్ ప్రయాణం!

గత అక్టోబర్ మూడవ వారంలో ప్రప్రథమంగా రెండు బెలూన్ల ద్వారా నలుగురు సాహసవంతులు ఎవరెస్టు శిఖరం మీదుగా ఎగిరిపోయి టిబెట్‌లో క్షేమంగా దిగారు. నేపాల్ నుంచి, పైకిలేచిన ఈ ప్రయాణం ఒక గంటకు పైగా సాగింది. ఒక బెలూన్‌లో ఆస్ట్రేలియా దేశస్థుడొకడూ, బ్రిటన్ దేశస్థుడొకడూ ప్రయాణం చేశారు. రెండవ బెలూన్ ఇద్దరు బ్రిటన్ దేశస్థులను మోసుకువెళ్ళింది. ఆస్ట్రేలియా–బ్రిటన్ సంయుక్తంగా ఏర్పాటు చేసిన ఈ ఎవరెస్టు సాహస ప్రయాణంలో—8,848 మీటర్ల ఎత్తయిన నేపాలీలు సాగర్‌మాత అని పిలిచే ఎవరెస్టు శిఖరం పైన 300 మీటర్ల ఎత్తులో బెలూన్లు ఎగిరాయి. దీనినొక చరిత్రాత్మకమైన సంఘటనగా చెప్పవచ్చు.

# చందమామ కబుర్లు

## అపూర్వ అనుభవం!

అమెరికాలోని ఓరిగాన్ విమానాశ్రయంలో—పైపెర్ కబ్ సింగిల్ ఇంజను గల రెండు సీట్ల చిన్న విమానంలో పేటీషార్ప్ అనే ఇరవైమూడేళ్ళ యువతి, పైనుంచి ఫోటోలు తీయడానికని బయలుదేరింది. ఆమె తండ్రి వయసు 62 ఏళ్ళు. ఆయనే విమానం నడపసాగాడు. పోతూపోతూ ఆయనకు హఠాత్తుగా గుండెపోటు రావడంతో విలవిలలాడిపోయాడు. పేటీ వెంటనే ఎంతో సమయస్ఫూర్తితో ముందుకు వంగి కంట్రోల్ బటన్లను నొక్కి విమానాన్ని క్షేమంగా భూమి మీదికి దించింది. ఇంతకూ ఆమె అంతకు ముందెన్నడూ విమానం నడిపి ఎరగదు!





# గెలుపు - ఓటమి

సోమనాథశాస్త్రి అనే ఆయన గొప్ప సంగీత విద్వాంసుడు. ఆయన కచేరీ చేస్తూన్నంతసేపూ, ప్రేక్షకశ్రోతలు తల లాడిస్తూ మంత్రముగ్ధుల్లా వుండిపోయే వారు. ఆయన ప్రతిభ గురించి ఆ దేశపు రాజు శ్రావణవర్మ విని, ఆయన్ని తన ఆస్థానానికి పిలిపించాడు.

సోమనాథశాస్త్రి సభాసదులతోపాటు, మహారాజును ఆనందసాగరంలో ముంచే కచేరీ చేశాడు. శ్రావణవర్మ చాలా సంతోషించి, ఆయనకు తన మెడలోని ముత్యాలహారం బహూకరించడమే కాక, ఆయనకు ఆస్థాన సంగీతాచార్య పదవి నిచ్చి, తన సంగీతాభిమానాన్ని చాటు కున్నాడు.

మహారాణి మైథిలీదేవి, సోమనాథశాస్త్రి పాండిత్యం గురించి విని, అంతఃపురంలో ఆయన కచేరీని ఏర్పాటు చేయవల సిందిగా రాజును కోరింది. శ్రావణవర్మ ఆ మర్నాడే సోమనాథశాస్త్రికి కబురుపెట్టి కచేరీ చేయవలసిందిగా కోరాడు.

అయితే, కచేరీ ప్రారంభంలోనే సోమ నాథశాస్త్రి ఆలపించిన కృతుల రాగాలపై తీవ్రమైన ఆక్షేపణ తెలియజేసింది, మైథిలీదేవి.

సోమనాథశాస్త్రికిది, భరించరాని అవమానం అనిపించింది. అయితే, మహా రాణిని ఎదిరించి సమాధానం చెప్పలేక పోయాడు. అలాగని, తన ఆలాపనలో అపశ్రుతులున్నాయని కూడా అంగీకరించ లేక పోయాడు.

''గొప్ప సంగీతవిద్వాంసుడినే పిలిపిం చారు. పైగా ఆస్థానంలో పదవి కూడా కట్టబెట్టారు. ఇదీ ఒక సంగీతమేనా ?'' అని మహారాజును కూడా కలిపి ఎద్దేవా చేసింది రాణి.

బొమ్మిడి అచ్చారావు



అందుకు సోమనాథశాస్త్రి వినయంగా, ''క్షమించండి, మహారాణీ! నా సంగీతంలో లోపాలు లేవని, నేను సమర్థించుకోదలచలేదు. అయితే, నా సంగీతం తమను అలరింపచేయలేకపోయింది కాబట్టి, నేను సంగీతాచార్యుడుగా తగనని అంగీకరించడంభావ్యమనుకుంటున్నాను. సెలవిస్తే, నేను ఆస్థానం నుంచి శాశ్వతంగా వెళ్ళిపోతాను,'' అన్నాడు.

శ్రావణవర్మ వెంటనే ఆయన్ను వారిస్తూ, ''అదేమిటి, శాస్త్రిగారూ! మిమ్మల్నెవరూ ఆస్థానం నుంచి వెళ్ళిపోమనలేదు. మహారాణికి ఎలాంటి సంగీతం కావాలో, అలాంటి సంగీతం వినిపించడం, మీ ధర్మం. మీరు ఆస్థానం నుంచి వెళ్ళిపోవడానికూడా మా అనుమతి కావాలని మరిచిపోకండి!'' అన్నాడు హెచ్చరిస్తున్నట్టు.

సోమనాథశాస్త్రి మొదటిసారిగా జీవితంలో పశ్చాత్తాపపడ్డాడు. స్వేచ్ఛగా ప్రజల మధ్య కచేరీలు చేసుకుంటూంటే, తన జీవితం హాయిగా గడిచిపోయేది. రాజాశ్రయంలో ఇన్ని చిక్కులుంటాయనీ, అదొక మొగలిపొదలాంటిదనీ, ఆయన ఇప్పుడు గ్రహించాడు.

తన బాధనూ, ఆగ్రహాన్నీ బయట పడనీయకుండా సోమనాథశాస్త్రి, రాజుతో, ''చెప్పండి, ప్రభూ! రాణీగారికి ఎలాంటి సంగీతం కావాలి?'' అన్నాడు.

''మీ రాగాలూ, స్వరాలూ, శాస్త్రీయ సంగీత పోకడలూ—వీటితో నిమిత్తం లేని, జానపదులగీతాలు వినిపించండి, మీకు చేతనైతే!'' అన్నది మహారాణి.

''కేవలం వారం రోజులంటే వారం రోజులు గడువివ్వండి చాలు, మహారాణీ! తమ కిష్టమైన జానపదులగీతాలు వినిపిస్తాను,'' అన్నాడు సోమనాథశాస్త్రి.

రాణి అంగీకరించింది; రాజు అనుమతించాడు.

సరిగ్గా వారం రోజుల్లోపలే సోమనాథశాస్త్రి అంతఃపురంలో కచేరీ చేశాడు.

వివిధ రకాలైన జానపదగీతాలు తెరిపి లేకుండా పాడి వినిపించాడు. మహారాణి ఆనందంతో చప్పట్లుచరిచింది. ఆమె అభిరుచిస్థాయి ఏపాటిదో సోమనాథశాస్త్రి కర్థమైపోయింది.

శ్రావణవర్మ, ఆయనను అభినందించి, "అటు శాస్త్రీయ సంగీతంలోనూ, ఇటు జానపద సంగీతంలోనూ మీరు మహా విద్వాంసులని రుజువు చేసుకున్నారు. ఇక మీదట మహారాణి వారి కిష్టమైన జానపద సంగీతాన్నే ఆస్థానంలోనూ విని పిస్తూండండి," అన్నాడు.

సోమనాథశాస్త్రి మౌనంగా తలూపాడు.

ఇది జరిగిన పక్షం రోజులకు, పొరుగు దేశం నుంచి ఒక సంగీత విద్వాంసుడు, శ్రావణవర్మ కొలువుకూటంలో ప్రవేశించి, "మహాప్రభూ! శాస్త్రీయసంగీతంలో నేను అనేక రాజాస్థానాల్లో తిరుగులేని విజయాలను సాధించాను. ఆయా రాజ్యాల విద్వాంసు లందరూ నా ముందు తమ ఓటమిని అంగీకరించి బంగారు మురుగులనూ, గండపెండేరాలనూ బహూకరించారు. నన్ను ఇక్కడ శాస్త్రీయ సంగీతంలో ఓడించగలవారికి, వీటినన్నిటినీ ధారపోసి దాసుణ్ణవుతాను. అలా కానప్పుడు, తమరు కూడా నన్ను ఉచిత రీతిని సత్కరించి ఓటమిని అంగీకరించవలసి వుంటుంది," అన్నాడు.

శ్రావణవర్మకు అతడి మాటలు అవమానకరంగా తోచాయి. ఆయన ఏమి



టన్నట్టు సోమనాథశాస్త్రి కేసి చూశాడు. తమ ఆస్థానంలో జానపదగీతాలు తప్ప, శాస్త్రీయసంగీతాన్ని వినిపించవద్దని ఆజ్ఞాపించిన మహారాజు, ఇప్పుడు శాస్త్రీయ సంగీతంలో పోటీ నెదుర్కొమని ఆదేశిస్తున్నాడు. ఇందుకు, సోమనాథశాస్త్రి మనసులో ఆగ్రహావేశాలు తల ఎత్తాయి. అయినా, దేశప్రతిష్ఠకు సంబంధించిన విషయం కాబట్టి, ఆయన పోటీకి సిద్ధమయ్యాడు.

పోటీ రసవత్తరంగా సాగింది. శాస్త్రీయ సంగీతంలోని అసలైన మాధుర్యాన్ని, ఆ రోజు శ్రావణవర్మ ప్రత్యక్షంగా వినగలిగాడు. సభికులంతా చెవులప్పగించి వింటూ వుండిపోయారు.

పొరుగుదేశపు విద్వాంసుణ్ణి, కొంత సేపటికి చిత్తుగా ఓడించి దాసోహమనిపించాడు, సోమనాథశాస్త్రి. ఆ విద్వాంసుడు ఓటమిని అంగీకరించి, తనకు వివిధ రాజాస్థానాల్లో లభించిన బంగారాన్నీ, ప్రశంసాపత్రాలనూ సోమనాథశాస్త్రి పాదాల ముందు వుంచి, రాజాస్థానం నుంచి వెళ్ళిపోయాడు.

శ్రావణవర్మ, సోమనాథశాస్త్రిని సభాముఖంగా ఘనంగా సత్కరించాడు. సభికులంతా ఆయనను వేనోళ్ళశ్లాఘించారు. తమ దేశ ప్రతిష్ఠను నిలిపినందుకు అందరూ ఆయనను ఎంతగానో అభినందించారు.

శ్రావణవర్మ, సోమనాథశాస్త్రి చేతులు పట్టుకుని, "మీరు మహావిద్వాంసులు! ఇక మీదట ఎక్కడనైనా సరే శాస్త్రీయ సంగీతాన్నే ఆలపించండి. జానపదగీతాల సంగతి మరిచిపోండి," అన్నాడు.

అయితే, సోమనాథశాస్త్రికి ఆ క్షణంలో, పొరుగుదేశపు విద్వాంసుడిపై తన గెలుపు కన్న, మహారాణి మంకుపట్టూ, సంగీతంలో ఆమెకున్న అధమస్థాయి అభిరుచీ మనసులో మెదిలినై. ఆయన ఆ మర్నాడు తెల్లవారకముందే లేచి ఎవరికీ చెప్పకుండా రాజాస్థానం విడిచి, ఎక్కడికో వెళ్ళిపోయాడు.





# అత్తగారి జబ్బు

సుభద్రకు అత్తవారింటికి వచ్చిన వారం రోజుల్లోనే, అక్కడి పరిస్థితులన్నీ పూర్తిగా అర్థమయినై. అత్తగారు మాంచాల చాలా తెలివైనదనీ, ఎటువంటి గడ్డు పరిస్థితుల్లోనైనా, అతి చాకచక్యంగా చక్రం తిప్పగల సమర్థురాలనీ తెలుసుకున్నది. మామ బలరామయ్య పేరుకు మాత్రమే. ప్రతిదానికీ భార్య చెప్పినట్టల్లా వింటూ తలూపడమే, ఆయన పని. ఇక భర్త తన మాట వినేవాళ్ళు ఇంట్లో ఎవరూ లేక, తల్లిదండ్రుల మధ్య నలుగుతున్న వ్యక్తి.

ఒక రోజు మరింత ఆశ్చర్యకరమైన విషయం సుభద్ర దృష్టికి వచ్చింది. ప్రతి రోజూ పొద్దునా, సాయంత్రం పళ్ళెంలో అన్నం పెట్టుకుని ఎక్కడికో వెళుతున్న, ఆడపడుచు రాధను, ''ఎక్కడికి వెళుతున్నావు ?'' అని ఆమె అడిగింది.

రాధ అమాయకంగా సుభద్ర వంక చూస్తూ, ''మా నాన్నమ్మకు అన్నం తీసుకుని వెళుతున్నాను,'' అన్నది.

ఆ జవాబు విని సుభద్ర నమ్మలేనట్టుగా, ''మీ నాన్నమ్మ బతికేవుందా?" అని అడిగింది.

రాధ తలూపుతూ, ''కావాలంటే నా వెంట రా, చూపిస్తాను !'' అన్నది.

సుభద్ర, రాధ వెంట వెళ్ళింది. రాధ ఆమెను ఊరి వెలుపల వున్న, తమ పశువుల కొట్టంలోకి తీసుకుపోయింది. కొట్టంలో ఒక మూలగా కుక్కిమంచం మీద పడుకుని వున్న, ఒక ముసలామెను సుభద్రకు చూపుతూ, ''అదుగో, మా నాన్నమ్మ !'' అన్నది రాధ.

సుభద్రకు ముసలావిడ దయనీయమైన పరిస్థితి చూసేసరికి, కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ముసలావిడ రాధ రావడం

దాసరి వెంకటరమణ



చూడగానే, మంచం కింద వున్న మట్టి మూకుడును ముందుకు జరిపింది. రాధ తను తెచ్చిన అన్నం అందులో పెట్టింది. సుభద్ర ఆమె దగ్గిరగా వెళ్ళి పాదాలకు నమస్కరించింది. ముసలావిడ సుభద్రను ఎగాదిగా చూస్తూ, "నువ్వు మా సూరయ్య పెళ్లానివి కదూ!" అన్నది.

సుభద్ర తలూపింది. ముసలావిడ ఆమెను దగ్గిరకు రమ్మని చేతితో తాకుతూ, "బంగారుబొమ్మలా వున్నావు. తల్లీ! నువ్వే ఇక మా సూరయ్యను కంటికి రెప్పలా చూసుకోవాలి," అన్నది.

ఇంతలో రాధ, సుభద్రను తొందర పెడుతూ, "మనం ఇక్కణ్ణించి త్వరగా వెళ్ళిపోవాలి. నువ్విక్కడికి రావడం అమ్మ చూసిందంటే కోప్పడుతుంది," అన్నది.

ఇంటికి తిరిగి వచ్చేప్పుడు సుభద్ర, రాధను, "మీ నాన్నమ్మ అలా ఎందుకు పశువుల కొట్టంలో వుంటున్నది? మనతో పాటు ఇంట్లో వుండవచ్చుగదా?" అని అడిగింది.

"మా నాన్నమ్మకు పెద్ద జబ్బు చేసింది. ఇంట్లో వుంటే, ఆ జబ్బు అందరికీ వస్తుందని, అమ్మ అలా పశువుల కొట్టంలో వుంచింది," అన్నది రాధ.

ఆ మర్నాడు చూంచాల, తల్లికి జబ్బుగా వుందని కబురు వస్తే పుట్టింటికి వెళ్ళింది. వెళ్ళేటప్పుడు తాళాలు కోడలు సుభద్ర చేతికి ఇచ్చింది.

నాలుగు రోజుల తర్వాత సుభద్ర అన్న సుదర్శనం, చెల్లెలి కొత్తకాపురం ఎలా వుందో చూసిపోదామని వచ్చాడు. సుదర్శనం ఆ ప్రాంతాల మంచి పేరున్న వైద్యుడు. సుభద్ర, అన్నకు ముసలావిడ పరిస్థితి చెప్పి, ఆమెను ఆదుకునేందుకు ఏదైనా ఉపాయం చెప్పమని అడిగింది.

సుదర్శనం ముసలమ్మను పరీక్షచేసి, అది వార్ధక్యం వల్ల వచ్చిన మామూలు జబ్బనీ, మందులు వాడితే తగ్గిపోతుందనీ చెప్పి—ముందు ఆమెను అక్కడి నుంచి

తెచ్చి పరిశుద్ధమైన వాతావరణంలో వుంచడం, అన్నిటికన్నా ముఖ్యమన్నాడు.

సుభద్ర, భర్తకు విషయం చెప్పి, ముసలావిడను ఇంటికి తెచ్చి, మందులు వాడుతూ పరిచర్యలు చేయసాగింది. సుదర్శనం తిరిగి వెళ్ళేటప్పుడు, సుభద్రకు రెండు గుళికలు ఇచ్చి, అత్త మాంచాల జబ్బు కుదరాలంటే, ఏం చేయాలో చెప్పాడు.



మాంచాల తిరిగి వచ్చేసరికి ముసలమ్మ కోలుకుని మెల్లగా తిరగసాగింది. ఆమెను చూస్తూనే మాంచాల మండిపడి, "ముసలావిడను ఇంటికి ఎవరు తెచ్చారు? ఆమె జబ్బు ఇంట్లో అందరికీ చుట్టుకుంటుంది," అంటూ కేకలు పెట్టింది.

సుభద్ర, అత్తగారిని సమాధానపరుస్తూ, "మా అన్న మంచి వైద్యం చేశాడు. అవ్వ జబ్బు అప్పుడే మాయమైంది," అన్నది.

మాంచాల ఇంకేమీ అనలేక వూరుకున్నది. ఆ మర్నాడు అన్న సుదర్శనం చెప్పిన ఉపాయం ప్రకారం, ఒక గుళిక నీళ్ళల్లో కలిపి అనుమానం రాకుండా అత్తగారిచేత తాగించింది. రెండు రోజుల్లో మాంచాల దగ్గుతో మంచం పట్టింది.

అది చూసి సుభద్ర పెద్దగా కేకలు వేస్తూ, "ఆవిడ ఆ విధంగా దగ్గుతూంటే, ఆ జబ్బు ఇంట్లోవాళ్ళకు చుట్టుకుంటుంది. అసలే నేను వట్టి మనిషిని కూడా కాదు," అని గొడవచేసింది.

మాంచాల పశువుల కొట్టంలోకి మారడానికి ఆట్టేకాలం పట్టలేదు. తనకు అన్నం తీసుకువచ్చిన రాధతో, మాంచాల, "నేనిక్కడ వుండలేను. నన్ను ఇంటికి తీసుకువెళ్ళండి," అన్నది.

"మరి జబ్బు చేసిందని, నాన్నమ్మను ఇక్కడే వుంచాం కదా! నువ్వూ ఇక్కడుండాల్సిందే," అన్నది రాధ.

ఆ సమయంలో అక్కడికొచ్చిన బలరామయ్య, భార్యతో, "నువ్వు ఎవరి మీదా కోపం తెచ్చుకోవలసిన అవసరం లేదు. ఇదంతా నీ స్వయంకృతాపరాధం.

ఏ విషయమైనా పెద్దల్ని చూసి పిల్లలు నేర్చుకుంటారు. నీ నుంచి నేర్చుకున్న ఈ విద్య, రేపు నీ కూతురు అత్తవారింట్లో అమలుపరుస్తుంది. నువ్వు, నీ అత్తగారిని ఆదరించిన తీరు, నీ కోడలు నీ నుంచి నేర్చుకున్నది. ఇందులో ఆమె తప్పేం లేదు. ఈ విషయంలో నేనూ, నీ కొడుకూ నిస్సహాయులం,'' అని, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

మూడు రోజులు గడిచినా మాంచాల, ఆ పాకలో మంచినీళ్ళు కూడా ముట్ట లేదు. మనిషి నీరసించి శోష వచ్చిన దానిలా పడిపోయింది. ఆ దుర్గంధం వచ్చే పరిసరాల్లో తన అత్త ఇంతకాలం ఎలా వున్నదో, అన్న ఆలోచన క్రమంగా ఆమెలో పశ్చాత్తాపం కలిగించసాగింది.

నాలుగవ రోజు ఉదయం కొడుకూ, కోడలూ మాంచాలను ఇంటికి తీసుకు పోయేందుకు వచ్చారు. మాంచాల తను ఇంటికి రాననీ, ఇక్కడే వదిలేయమనీ కొడుకుతో కోపంగా అన్నది.

అందుకు సూర్యం, ''నిన్నిక్కడ వుండనిచ్చేవాళ్ళమే—కాని, నిన్నిక్కడికి పంపింది మొదలు నాన్నమ్మ మంచినీళ్ళు కూడా ముట్టలేదు. నువ్విక్కడ ఎలా వుండగలుగుతున్నావన్న దిగులుతో, ఆమె మంచంపట్టింది. నిన్ను ఇంటికి తీసుకు పోకపోతే, మరి రెండు రోజుల్లో కన్ను మూసేలా వుంది,'' అన్నాడు.

అది వినగానే మాంచాలకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అంత మంచి మనసున్న అత్తగారినా, తానింతకాలం బాధపెట్టింది, అని కుమిలిపోయింది. మనుషుల మధ్య వుండే ఆత్మీయతా, ఆప్యాయతల విలు వేమిటో, ఆమెకు అర్థమైంది.

మాంచాల ఇంటికి తిరిగి వచ్చాక, ముస లావిడ సంతోషంగా భోజనం చేసింది.

రెండు రోజులు చూసి అత్తగారి అస లైన జబ్బు తగ్గిపోయిందని రూఢిచేసు కున్నాక సుభద్ర, సుదర్శనం ఇచ్చిన రెండో గుళికను నీళ్ళల్లో కలిపి తాగించేసరికి, అత్తగారి దగ్గుబాధ నయమైపోయింది.






హనుమంతుణ్ణి చంపేస్తామని ఆయుధాలు పట్టి లేచి నిలబడిన విశుంభుడు మొదలైన రాక్షసులను కూర్చోమని చెప్పి, విభీషణుడు రావణుడికి నమస్కరించి ఇలా అన్నాడు:

"సామదాన భేదోపాయాలతో సాధ్యం కాని సమయంలోనే దండోపాయాన్ని అవలంబించాలని పెద్దలు చెబుతారు. రాముడి బలాన్ని తక్కువ చేసి చూడవద్దు. హనుమంతుడు సముద్రం దాటి వచ్చి ఇంత అల్లకల్లోలం చేశాడంటే, దైవం వాళ్ళకు అనుకూలంగా ఉన్నట్టు స్పష్టమవుతున్నది. రాముడు ఖరుడు మొదలైన రాక్షసులను చంపినందుకు ప్రతిక్రియగా రావణుడు సీతను తెచ్చాడని అంటున్నారు. అది సరికాదు. తనను చంపటానికి వచ్చినప్పుడే రాముడు ఆ రాక్షసులను చంపాడు. ఆత్మరక్షణ తప్పుకాదు గదా! మనం సీతను తీసుకువచ్చి ప్రమాదాన్ని తెచ్చుకున్నాము. వైరం కలిగించేది ఎంత మంచిదైతే ఏం లాభం? మనం సీతను రాముడికి ఇచ్చెయ్యాలి. మహాపరాక్రమశాలి అయిన రాముడితో అనవసరంగా వైరం తెచ్చుకోవటం దేనికి? రాముడు లంకానగరాన్ని ముట్టడించక ముందే సీతను ఇయ్యటం మేలు. లేని పక్షంలో లంకకూ, రాక్షసులకూ కూడా చేటు! నేను చెప్పినది నిజమూ, యదార్థమూ కూడానూ. కోపంవల్ల సుఖమూ, ధర్మమూ కూడా

19. విభీషణ శరణాగతి



చెడతాయి. నేను చెప్పినట్టు చేస్తే అందరమూ సుఖంగా ఉంటాం.''

విభీషణుడి మాటలు రావణుడికి నచ్చ లేదు. అతను కోపంగా, ''నాకు ఎవరి భయమూలేదు. రాముడు సీతను నా వద్ద నుంచి తీసుకుపోలేడు. దేవేంద్రుణ్ణి తోడు తెచ్చుకున్నా రాముడు యుద్ధంలో నా ముందు నిలవలేడు,'' అన్నాడు.

మర్నాడు రావణుడు యుద్ధతంత్రం గురించి మంత్రులతో ఆలోచించటానికి, రత్నాలంకారాలు గల బంగారు రథం మీద ఆలోచనా మందిరానికి బయలు దేరాడు. అతని వెంట ఆయుధాలు ధరించిన రాక్షసులు నడిచారు. అతను సభకు చేరుతూనే దూతలను పంపి రాక్షసులను పిలిపించాడు. రాక్షసులు వచ్చి ఆసనాలమీదా, దర్భాసనాలమీదా కూర్చున్నారు.

సభ నిశ్శబ్దంగా ఉన్నది. రావణుడు ఏమి చెప్పతాడోనని అందరూ ఆత్రంగా చూస్తున్నారు. రావణుడు ప్రహస్తుడి కేసి తిరిగి, ''సేనానాయకా, పట్టణాన్ని మరింత శ్రద్ధగా కాపాడటానికి మంచి యోధులను నియమించు,'' అన్నాడు.

ప్రహస్తుడు అప్పటికప్పుడే పట్టణ రక్షణకు సైన్యాన్ని నియోగించి, ''ఇంకా ఏం చెయ్యమంటారు ?'' అని అడిగాడు.

రావణుడు సభను ఉద్దేశించి ఇలా అన్నాడు:

''ధర్మార్థ కామాల విషయంలో సంకటం కలిగినప్పుడు మంచి చెడ్డలు గ్రహించడంలో మీరు సమర్థులు. మీరు చేసిన నిర్ణయాలు ఎప్పుడూ మంచి ఫలి తాలనే ఇచ్చాయి. నేను చెప్పే విషయం కుంభకర్ణుడికి తప్ప మీ కందరికీ తెలిసి నదే. అతను గడిచిన ఆరుమాసాలూ నిద్ర పోతూ ఉండి, ఇప్పుడు ఇక్కడికి వచ్చి ఉన్నాడు. నేను దండకారణ్యం నుంచి, రాముడి భార్య అయిన సీతను తెచ్చాను. సీత వంటి సౌందర్యవతి మూడు లోకాల లోనూ లేదు. తనను రక్షించడానికి

రాముడు వస్తాడని ఆమె ఆశ కావచ్చు. కాని సముద్రాన్ని దాటి రాముడు ఇక్కడికి ఎలా వస్తాడు? అయితే, ఒకవేళ రామలక్ష్మణులు దాటి వస్తే ఏం చెయ్యాలి? ఒక్క కోతి వచ్చి ఇంత బీభత్సం చేసి పోయింది గదా! అందుచేత కర్తవ్యం చక్కగా ఆలోచించండి! సముద్రం అవతలి ఒడ్డున రామలక్ష్మణులూ, సుగ్రీవుడు వానరసేనతోనూ ఉన్నారు. సీతను ఇచ్చెయ్యకపోతే మీరు రామలక్ష్మణులను చంపగలరు కదా! వానరసేన సముద్రాన్ని దాటి రాగలదా? అన్నీ ఆలోచించండి."



రావణుడీ మాటలు అంటే కుంభకర్ణుడికి చాలా కోపం వచ్చింది. అతను రావణుడితో, "నువ్వు బలాత్కారంగా రాముడి భార్యను తెచ్చేటప్పుడు ఎవరితోనూ ఆలోచించావు కావు. ఇప్పుడు మాతో ఆలోచించేదేమిటి? ఇది చేతులు కాలినాక ఆకులు పట్టుకున్నట్టున్నది. సీతను ఎత్తుకు రావటం ఎంత అపాయకరమో నువ్వు తెలుసుకోలేదు. కాని అదృష్టవశాన రాముడు ఇప్పటి దాకా నిన్ను చంపలేదు. ఇప్పుడు నీ కేమీ భయం లేదు. నీ శత్రువులందరినీ నేను చంపుతాను. నేను ఇనుప గద తీసుకుని యుద్ధానికి పోతే ఇంద్రుడు కూడా పారిపోవలసిందే! నేను రామలక్ష్మణులను చంపి, వానరులను తినేస్తాను. నువ్వు నిశ్చింతగా ఉండు," అన్నాడు.

ఈ మాటలకు రావణుడు అలిగినట్టు మహాపార్శ్వుడికి తోచింది. రావణుడి అలక పోగొట్టటానికి అతను ఇలా అన్నాడు:

"సీత విషయంలో నీకు ఎలాంటి భయమూ వద్దు. నువ్వే అందరినీ ఆజ్ఞాపించగలవాడివి. నిన్ను అడ్డేదెవరు? అందువల్ల ఏం ప్రమాదం వస్తుందోనని నువ్వు భయపడనవసరం లేదు. ఈ కుంభకర్ణుడూ, ఇంద్రజిత్తూ ఉండగా ఎవరు యుద్ధానికి వచ్చినా భయం లేదు."

ఈ మాటకు రావణుడు సంతోషించి, మహాపార్శ్వుడితో, "ఒక రహస్యం



రొమ్ములో పడగ ఉన్నది. చింత అనే విషం ఉన్నది, చిరునవ్వులో కోరలున్నాయి, ఆమె చేతి వేళ్ళు పాముతలలు. వానరయోధులు లంకలో అడుగు పెట్టక ముందే సీతను రాముడికి ఇచ్చెయ్యి. ఈ కుంభకర్ణుడుగాని, ఇంద్రజిత్తుగాని, మహాపార్శ్వుడుగాని, యుద్ధంలో రాముడి ముందు నిలవరు. రాముడు నిన్ను ప్రాణాలతో విడవడు,'' అన్నాడు.

ప్రహస్తుడు విభీషణుడి మాటలను కొట్టేసి, రావణుడికి ఎవరూ అడ్డులేరన్నాడు. ఇంద్రజిత్తు విభీషణుడికి భయం పట్టుకున్నదని ఆక్షేపించాడు: ''పులస్త్య వంశంలో నీ వంటి పరాక్రమ శూన్యుడు మరొకడు లేడు. రామలక్ష్మణులను చంపటానికి రాక్షస వీరులలో ఏ ఒక్కడైనా చాలు! నువ్వెందుకు భయపడుతున్నావు? ఇంద్రుణ్ణి ఓడించి, దేవతలను పీడించిన నేను మనుషులను జయించలేనా?'' అని విభీషణుణ్ణి అడిగాడు.

''నాయనా, నువ్వు చెప్పే మాటలు రాక్షసవంశానికి చేటు తెస్తాయి. రాముడి బాణాల ముందు ఎవరూ నిలవలేరు. అతనికి సీతను ఇచ్చెయ్యటం అన్నివిధాలా మంచిది,'' అన్నాడు విభీషణుడు.

రావణుడు ఇక సహించలేక, విభీషణుణ్ణి నానామాటలూ అని, ''నువ్వు

ఉన్నది. నేనొకసారి బ్రహ్మదేవుడి ఇంటికి పోతున్న పుంజికస్థల అనే అప్సరసను చూసి, సభ్యతమీరి ప్రవర్తించాను. పుంజికస్థల ఈవిషయం బ్రహ్మతోచెప్పిందికాబోలు. ఆయన నన్ను హెచ్చరిస్తూ, పరస్త్రీని బలాత్కరిస్తే నా తల నూరు చెక్కలై పోతుందన్నాడు. నాకున్న వేగమూ, గమనమూ తెలియక రాముడు నా మీదికి వస్తున్నాడు. అతను అజ్ఞాని కావటం చేత మృత్యువుతో చెలగాటాలాడుతున్నాడు,'' అన్నాడు.

కుంభకర్ణుడి మాటలూ, రావణుడి మాటలూ విన్న మీదట విభీషణుడు, ''రాక్షసరాజా, నువ్వు ఈ సీతను ఎందుకు కోరావు? ఆమె మహాసర్పం. ఆమె

తమ్ముడివి గనక బతికిపోయావు. ఈ మాటలే ఇంకొకడు అన్నట్టుంటే ఆ క్షణమే ప్రాణాలు తీసి ఉందును!'' అన్నాడు.

విభీషణుడికి కోపం వచ్చింది. అతను రావణుడితో, ''నువ్వు నాకు అన్నవు, తండ్రివంటి వాడివి. నీ క్షేమం కోరి చెప్పిన మాటలు నీకు రుచించలేదు. నీకు రుచించే మాటలు చెప్పేవాళ్ళు చాలా మంది ఉంటారు. నేను నీకు కోపం తెప్పించినందుకు క్షమించు. నేను వెళ్ళిపోతున్నాను కనక నువ్వు సుఖంగా ఉండు. నిన్ను నువ్వు రక్షించుకో, ఈ రాక్షసులనూ లంకాపట్టణాన్ని రక్షించుకో,'' అన్నాడు.

విభీషణుడు తన గద తీసుకుని మరి నలుగురు రాక్షసులతో సహా ఆకాశంలోకి లేచి, రామలక్ష్మణులున్న చోటికి వచ్చేశాడు. వాళ్ళు ఆకాశమార్గాన తమకేసి వస్తూండటం వానరులకు కనిపించింది. ఆ వచ్చేవాళ్ళు తమ రహస్యాలను తెలుసుకోవటానికో, తమను చంపటానికో వస్తున్నారని సుగ్రీవుడికి అనుమానం కలిగింది. అతను ఆ మాట హనుమంతుడు మొదలైన వాళ్ళతో అనేసరికి, వాళ్ళు చెట్లూ, రాళ్ళూ తీసుకుని, ఆ వచ్చేవాళ్ళను చంపటానికి సుగ్రీవుడి అనుమతి కోరారు.

విభీషణుడూ, అతని వెంట ఉన్న అనలుడూ, శరభుడూ, సంపాతీ, ప్రఘసుడూ అనే రాక్షసులూ, ఆకాశంలోనే నిలిచారు. విభీషణుడు సుగ్రీవుడితోనూ, వానరులతోనూ గట్టిగా ఇలా అన్నాడు:





"దుర్మార్గుడూ, రాక్షసరాజూ అయిన రావణుడికి నేను తమ్ముణ్ణి. నా పేరు విభీషణుడు. రావణుడు జటాయువును చంపి, జనస్థానం నుంచి సీతను తెచ్చాడు. ఆ సీత ఎంతో దుఃఖిస్తూ, రాక్షస స్త్రీల రక్షణలో ఉన్నది. సీతను రాముడికి ఇచ్చెయ్యమని నేను అతనితో మంచిగా ఎన్నోసార్లు చెప్పాను. విధి తరుముతూ ఉండటం చేత, ఔషధంలాటి నా హితం అతనికి రుచించలేదు. పైపెచ్చు, నన్ను నానామాటలూ అని, సేవకుణ్ణిలాగా అవమానించాడు. అందుచేత నేను భార్యా పుత్రులను విడిచిపెట్టి రాముడి శరణు కోరి వచ్చాను."

ఈ మాట విని సుగ్రీవుడు రాముడితో, "రావణుడి తమ్ముడు, విభీషణు డనే వాడు నలుగురు రాక్షసులను వెంటబెట్టుకుని నీ శరణుకోరి వచ్చాడు. జాగ్రత్త! ఈ రాక్షసులు మాయం కాగలరు; కామరూపులు; శూరులు; జిత్తులలో ఆరితేరిన వాళ్ళు. వాళ్ళను నమ్మరాదు. ఈ విభీషణుడు రావణుడు పంపిన చారుడు కావచ్చు. అతను మనలో వాడుగానే ఉంటూ మన మధ్య విభేదాలు కలిగించవచ్చు; లేదా అవకాశం చూసుకుని మనని చంపవచ్చు. సాక్షాత్తూ రావణుడి తమ్ముడు, శత్రుపక్షం నుంచి వచ్చాడు! ఇతన్ని ఎలా నమ్మటం? ఇతన్నీ, ఇతని నలుగురు అనుచరులనూ చంపెయ్యటమే మంచిది!" అన్నాడు.

సుగ్రీవుడు చెప్పిన మాటలను విని రాముడు తన సమీపంలో ఉన్న హనుమంతుడు మొదలైన వాళ్ళతో, "సుగ్రీవుడు బాగా ఆలోచించి చెప్పిన మాటలు విన్నారు కదా. మీకు ఏం తోస్తున్నదో మీరు కూడా చెప్పండి," అన్నాడు.

మొదట అంగదుడు ఇలా అన్నాడు: "ఏమైనా శత్రు పక్షం వాణ్ణి గుడ్డిగా నమ్మరాదు. అందువల్ల చాలా నష్టం ఉంటుంది. ముందు ఈ విభీషణుడి తత్వం తెలుసుకోవాలి."

''ఇతని దగ్గరికి వెంటనే ఒక చారుణ్ణి పంపటం, సరి అయిన మార్గంగా తోస్తుంది,'' అన్నాడు శరభుడు.

జాంబవంతుడు, ''నీ శత్రువైన రావణుడి వద్ద నుంచి ఈ విభీషణుడు ఇలా వచ్చెయ్యటానికి ఎలాటి కారణమూ కనిపించదు. అతన్ని శంకించక తప్పదు,'' అన్నాడు.

''మన మనిషి వెళ్ళి విభీషణుణ్ణి రావణాసురుడి వృత్తాంతం ఏమిటని అడిగితే బాగుంటుంది. అతను ఎలాంటి వాడో వెంటనే తెలిసిపోతుంది,'' అన్నాడు మైందుడు.

హనుమంతుడు ఇలా అన్నాడు:

''విభీషణుణ్ణి పరీక్షించి చేరదీయాలని ఇంతమందీ చెప్పిన మాట నాకు సరిగా కనబడలేదు. అతన్ని చేరదీస్తేనే గాని అతని మంచి చెడ్డలు తెలియవు; మంచి చెడ్డలు తెలుసుకునిగాని మనం అతన్ని చేరదీయరాదు—ఇది ఎలా పరిష్కారం అవుతుంది? ఇక చారుణ్ణి ఎదురుగా ఉన్న వాడి వద్దకు పంపటం అర్థం లేని పని; దూరాన ఉన్నవాడి వద్దకైతే పంపవచ్చు. జాంబవంతుడి మాట కూడా నిజం కాదు. కాలమూ, దేశమూ కలిసి రావటం చేతనే విభీషణుడు వచ్చాడు. నిన్నూ, రావణుణ్ణీ పోల్చి చూసి, రావణుడికి హితం చెప్పి, అతని చేత అవమానం పొంది, అతన్ని విడిచి నీ వద్దకు వచ్చాడు. అతని రాక అకారణం కాదు. మైందుడు చెప్పినట్లు ఎవరైనా వెళ్ళి, రావణుడి సంగతి అడగగానే విభీషణుడు తడుపుకోకుండా చెప్పేస్తాడా? విభీషణుడు తాను ఎందుకొచ్చాడో చెప్పాడు. అందులో నాకు తప్పు ఏమీ కనబడలేదు. అతను దొంగలాగా లేడు. నిర్భయంగా ఉన్నాడు. వాలిని చంపి సుగ్రీవుడికి వానరరాజ్యం ఇచ్చినట్టుగానే, రావణుణ్ణి చంపి తనకు లంకారాజ్యం ఇస్తావని ఇతను నీ వద్దకు వచ్చాడని నాకు తోస్తుంది. విభీషణుణ్ణి చేరదీయవచ్చునని నా ఉద్దేశం. తరువాత నీ ఇష్టం!''





# తృప్తిలేనివాడు

చాలా కాలం క్రితం చువాంగ్ రాష్ట్రంలో ఒక గొప్ప శిల్పి ఉండేవాడు. మంచి పనితనం కలవాడు కావటం చేత అతనికి గొప్ప పేరు ఉండేది.

ఒకనాడు ఒక సంపన్నుడు కొంత చెక్కడం పని చేయించుకో గోరి శిల్పిని పిలిపించాడు. శిల్పి వచ్చి చూసేసరికి అతనికి ఒక గొప్ప భవంతీ, సంపదా, నౌకర్లూ, చాకర్లూ కనిపించారు. అదంతా చూసేసరికి శిల్పికి కన్ను కుట్టింది. అతడు తన వృత్తి మానేసి, సంపదల్లో ఓలలాడాలని కోరుకున్నాడు.

అతని కోరిక గ్రహించి ఒక దేవత అతనికి అంతులేని సంపద ఇచ్చింది. శిల్పి పరమానంద భరితుడు అయ్యాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు ఒక ప్రభుత్వోద్యోగి పర్యటన చేస్తూ, సపరివారంగా, మేనా కుర్చీలో బోయీల చేత మోయించుకుంటూ శిల్పి ఇంటి ముందుగా వచ్చాడు. అతనికి ఎదురైన వాళ్ళంతా వంగి, వంగి నమస్కారాలు చేస్తున్నారు. శిల్పి ధనమదంలో అధికారికి నమస్కారం చెయ్యలేదు. అందుకు అధికారి ఆగ్రహించి, శిల్పిని తన భృత్యుల చేత చావ చితక కొట్టించి, ముందుకు సాగిపోయాడు.

"ఉత్త డబ్బుండి చాలదన్నమాట! అధికారం కూడా ఉండాలి. నాకు పెద్ద అధికారి హోదా కావాలి!" అనుకున్నాడు శిల్పి.

దేవత అతన్ని అధికారి చేసేసింది. శిల్పికి ఇప్పుడు అధికారమదం పట్టుకున్నది.

ఒకనాడు శిల్పి తన అనుచరులతో పోయి, ఒక కొండ ప్రాంతంలో కొంత మంది అందమైన ఆడపిల్లలను చూసి,

చువాంగ్ జానపద కథ

వాళ్ళను పీడించబోయాడు. వాళ్ళు కేకలు పెట్టేటప్పటికి అక్కడి కొండమనుషులు కర్రలూ, బరిసెలూ, గొడ్డళ్ళూ తెచ్చి, శిల్పి మీదా, అతని అనుచరుల మీదా పడి బీభత్సం చేశారు.

"ఛీ, ఛీ! ఈ గిరిజనుల ముందు ఏ అధికారీ నిలవలేడు. నేను ఈ గిరిజనులలో ఒకడుగా ఉంటాను," అనుకున్నాడు శిల్పి. దేవత అతన్ని గిరిజనుడుగా మార్చింది.

ఒకనాడు నడి ఎండాకాలంలో అతను పొలంలో ఉండగా ఎండ వేడికి తల తిరిగి పోసాగింది. ఒక కారుమేఘం వచ్చి సూర్యుణ్ణి కప్పేసింది. వెంటనే శిల్పి, "ఆహా, శక్తి అంటే ఈ మేఘానిది! నేను మేఘాన్ని అవుతాను," అనుకున్నాడు. మరుక్షణం దేవత అతన్ని మేఘంగా మార్చింది. అంతలోనే గాలి ఆ మేఘాన్ని ఎగరవేసుకు పోసాగింది.

"మేఘంగా ఉండటంకన్న గాలిగా ఉండటం ఇంకా గొప్ప!" అనుకున్నాడు శిల్పి. వెంటనే అతను గాలిగా మారి, ఆకాశాన విహరింపసాగాడు.

కొద్ది సేపటికల్లా ఆ గాలి వెళ్ళి ఒక కొండను ఢీకొన్నది. కొండ దాన్ని మరి కదలనియ్యలేదు.

"ఇంత గాలీ కొండకు లోకువే గద! నేను కొండను అవుతాను," అనుకున్నాడు శిల్పి. దేవత అతన్ని పెద్ద కొండరాయి చేసింది.

ఒకనాడు కొందరు శిల్పులు ఆ ప్రాంతానికి వచ్చి, రాయి రూపంలో ఉన్న శిల్పిని చూసి, "ఈ రాయి చాలా మేలైనది. దీన్ని పగలగొట్టి తీసుకుపోయి శిల్పాలు చేద్దాం!" అనుకున్నారు.

శిల్పి కంగారుపడి, "ఓ దేవతా, రక్షించు!" అన్నాడు.

"నువ్వు, శిల్పిగా ఉండటమే మంచిది," అంటూ దేవత అతనికి యథా రూపం ఇచ్చేసింది. అటు తరవాత శిల్పి అసంతృప్తి విడిచిపెట్టి, శిల్పిగానే జీవిస్తూ, డబ్బూ, కీర్తీ గడించుకున్నాడు.



# చదువెందుకు?

కుంతలదేశాన్ని పాలించే కురంగనాభుడికి, చదువెందుకు? అన్న విచిత్రమైన సందేహం కలిగింది. తన సందేహాన్ని రాజు ఒకనాడు నిండుసభలో వెలిబుచ్చాడు.

"చదువుకుంటే, మంచి పదవి, దాని ద్వారా ధనం సంపాదించవచ్చు," అన్నాడొక పండితుడు.

"చదువుకుంటే కీర్తి వస్తుంది," అన్నాడు ప్రధానమంత్రి.

"చదువుకుంటేనే మనిషికి గౌరవం లభిస్తుంది. అందుకే చదువుకోవాలి!" అన్నాడు ఒక కవి.

"విద్యావంతుడు అన్ని దేశాలలోనూ పూజింపబడతాడు. విద్యను ఏ దొంగా దొంగిలించుకు పోలేడు. విద్యాధనమే ఉత్తమమైనది!" అన్నాడు ఆస్థాన విద్వాంసుడు.

అయినా, రాజుకు ఈ సమాధానాలేవీ తృప్తినివ్వలేదు. తన సందేహానికి సరైన సమాధానం లభించక రాజు మథన పడటం గమనించిన ఆస్థాన విదూషకుడు లేచి నిలబడి, "మహారాజా! నా సమాధానం తమకు ఆగ్రహం కలిగిస్తుందేమోనన్న భయం కలుగుతున్నది!" అన్నాడు.

"నీకాభయంవద్దు. నీ సమాధానం నచ్చకపోయినా నిన్ను శిక్షించను. నిర్భయంగా చెప్పు. చదువెందుకు?" అని అడిగాడు రాజు.

"చిత్తం మహారాజా! ఇటువంటి అనుమానాలు రాకుండా ఉండేటందుకు; ఒకవేళ వచ్చినా, ఈ విధంగా అందర్నీ వేధించకుండా ఉండేటందుకు చదువు చాలా అవసరం!" అన్నాడు విదూషకుడు.

అందరూ ఘొల్లున నవ్వారు.

రాజు కురంగనాభుడు ఒక్క క్షణం నిర్ఘాంతపోయి, వెంటనే తేరుకుని నలుగురితో కలిసి తనూ మనస్ఫూర్తిగా నవ్వేశాడు.

—పొన్నపల్లి సాహితీసౌందర్య





# ధర్మయుద్ధం

విక్రమదేవుడు అలకాపురి రాజ్యానికి ప్రభువు. ఆయన సేనానాయకులలో కంఠీరవుడు గొప్ప వీరుడు. ఒక విజయదశమినాడు రాజూ, సేనానాయకులూ, పరివారమూ అంతా వెన్నెల్లో కూర్చుని ఊబుసులాడుకుంటున్నారు.

అప్పుడు ఒక విచిత్రమైన వ్యక్తి గుర్రం మీద వచ్చి దిగాడు. అతనిని చూస్తూనే పరివారంలో ఒకడు, ''ఎవరు నువ్వు? మిత్రుడివా, శత్రువువా?'' అని అడిగాడు.

ఆ వ్యక్తి, ''శత్రువునూ కాదు, మిత్రుణ్ణీ కాదు; నేనొక యోధుణ్ణి,'' అన్నాడు.

''ఐతే, నీకేం కావాలి?'' అని అడిగాడు విక్రమదేవుడు.

''యోధుడికి కావలసిందేమిటి, బలాబలాలు చూసుకోవటమేగా?'' అని ఎదురు ప్రశ్న వేశాడు ఆ వ్యక్తి, నవ్వుతూ.

ఆ మాటకు అందరూ అతని కేసి చూశారు. అతను ఆజానుబాహువు. నల్లటి గెడ్డం. చేతిలో తళతళ మెరిసే గండ్రగొడ్డలి!

''సరే, నీతో యుద్ధం చేయటానికి మా సేనాని కంఠీరవుడు,'' అని రాజు అనే సరికల్లా, కంఠీరవుడు లేచి నిలబడ్డాడు.

అప్పుడు యోధుడు నవ్వుతూ, ''నేను యుద్ధంకోసమని రాలేదు. ఇదిగో ఈ గండ్రగొడ్డలి చూశారుకద! మీలో ఎవరైనా సరే, దీనితో నా కంఠం మీద ఒక్క దెబ్బ వేయండి. ఒక్కటే దెబ్బ! ఈ దెబ్బకు గాను, నన్ను కొట్టిన యోధుడు, వచ్చే యేడు మళ్ళీ ఇదే పండగరోజున, నావద్దకు వచ్చి ఇదే గండ్రగొడ్డలితో మెడ మీద ఒక్క దెబ్బ తినాలి,'' అన్నాడు.

చిత్రమైన ఈ కోరిక వినగానే అందరూ పకపక నవ్వారు. పదునైన ఆ గండ్రగొడ్డ

25-ఏళ్ళనాటి చందమామ కథ

లితో కంఠం మీద దెబ్బతిని, ఇంకా బతికి వుండడమా? ఆ దెబ్బకు మళ్ళీ సంవత్సరం గడిచాక బదులు దెబ్బ తీయడమా!



అందరూ విస్తుపోయి చూస్తూ వున్నారు. యోధుడు సిద్ధంగా వున్నాడు. కంఠీరవుడు యోధుడి చేతిలోని గండ్రగొడ్డలి తీసుకొని, రెండు చేతులతో బలంగా కంఠం మీద ఒక్క వేటు వేశాడు.

ఆశ్చర్యం! గండ్రగొడ్డలి కంఠంలో సగంవరకు దిగింది. కాని ఒక్క నెత్తురు బొట్టు అయినా కింద రాలలేదు. యోధుడు నిలబడే వున్నాడు!

గొడ్డలి లాగేసి, మెడ తడుముకున్నాడు యోధుడు. అతనికి ఏమీ జరగనట్టే అనిపించింది.

ఎప్పటిలాగా అతడు నవ్వుతూ, కంఠీరవుడి కేసి చూసి, "ఇచ్చిన మాట తప్పకుండా నువ్వు, వచ్చే సంవత్సరం మళ్ళీ ఈ రోజునాటికి, నేనుండే ఫలానా గిరి దుర్గానికి వచ్చెయ్యి." అంటూ, గుర్రం ఎక్కి వెళ్ళిపోయాడు.

అందరూ నిర్ఘాంతపోయారు!

* * *

ఏడాది ఇట్టే గడిచిపోయింది. చూస్తూ వుండగానే విజయదశమి దగ్గరపడింది. ఆ యోధుడి మహిమను గురించి రాజు గాని, మంత్రిగాని ఏమీ నిర్ధారణ చేయలేక పోయారు. ఏమైనా కానీ, మాట నిలుపుకోవాలంటే కంఠీరవుడు గిరిదుర్గం వెళ్ళితీరవలసిందే. ఆ యోధుడు దెబ్బ తీసుకోటానికి అవకాశం ఇవ్వవలసిందే. మాట నిలుపుకోకుంటే రాజుకూ, రాజ్యానికీ కూడా కళంకం. కనుక బాగా ఆలోచించి, విక్రమదేవుడూ, పరివారమూ కంఠీరవుణ్ణి సాగనంపారు.

సాగనంపారే కాని, తమ సేనాని మళ్ళీ తిరిగివస్తాడనే నమ్మకం వారిలో ఎవరికీ లేదు. అటువంటి వీరుడు తమకు లేకుండా పోతున్నాడే అని వారెంతో విచారించారు.



కంఠీరవుడు సంతోషంగా బయలుదేరి, రాత్రింబగళ్ళు అరణ్యాలలో ప్రయాణం చేస్తూ పోయాడు. అలసిపోవటం చేత, గుర్రం దిగి, బడలిక తీర్చుకొందామని ఒక చెట్టు కింద కూర్చున్నాడు.

అంతలోనే, ఒక ఆర్తనాదం అతనికి వినిపించింది. చప్పున లేచి, ఏమిటా అని చూడగా, దొంగలబారిని పడిన ఒక రాజకుమారి కనిపించింది. కంఠీరవుడు ఖడ్గం దూసేసరికి దొంగలు చెల్లాచెదరై పారిపోయారు.

కంఠీరవుడు రాజకుమారికి కట్టివున్న కట్లు అన్నీ విప్పి ఆమె సమాచారాలన్నీ అడిగి తెలుసుకొన్నాడు. ఇటువంటి ఆపద నుంచి తనను రక్షించినందుకు గాను ఆ రాజకుమారి ఒక మహిమ గల ఉంగరం అతనికి బహుమతిగా ఇస్తూ, "ఈ ఉంగరం ధరించండి. ఇది దగ్గర ఉంటే ఎటువంటి శక్తివంతమైన ఆయుధాలైనా మీకు హాని చేయలేవు," అని చెప్పింది.

కంఠీరవుడు ఉంగరాన్ని తీసుకోలేదు. "పోయినయేడు ఒక షరతు మీద నేను ఒక యోధుణ్ణి పదునైన గండ్రగొడ్డలితో కంఠం మీద కొట్టాను. అదే విధంగా నేను ఇప్పుడు అతనిచేత బదులుదెబ్బ తినటమే ధర్మం. మహిమ గల ఉంగరాన్ని మాటు పెట్టుకుని నేను వెళ్ళటం అధర్మం. వీరుడినైన నేను అటువంటి పనికి అంగీకరించలేను," అని చెప్పి, చెట్టుకిందకు చేరుకొన్నాడు.

మరి కొంతసేపైన తరవాత దగ్గర వున్న నదికి స్నానానికని వెళ్ళాడు కంఠీరవుడు. అతడు నదికేసి వెళ్ళడం చూసి రాజకుమార్తె మెల్లగా ఆ చెట్టుకిందకు వెళ్ళింది. అతడు తిరిగి వచ్చేసరికి ఆమె కనిపించలేదు.

కంఠీరవుడు అక్కడి నుంచి బయలుదేరి గిరిదుర్గం చేరుకొనేటప్పటికి యోధుడు అక్కడ గండ్రగొడ్డలితో సిద్ధంగా వున్నాడు. "మాట తప్పని నిన్ను చూస్తే

నాకు చాలా సంతోషంగా వుంది,'' అని కంఠీరవుణ్ణి అతడు ఎంతగానో మెచ్చుకున్నాడు.

కంఠీరవుడు తయారుగా నిలబడి, ''మిత్రమా, బదులుదెబ్బ తీసుకో!'' అన్నాడు సంతోషంతోనూ, ధైర్యంతోనూ. ''ఒక్క దెబ్బమాత్రమే సుమా!'' అని హెచ్చరిక కూడా చేశాడు.

ఈ హెచ్చరిక విని యోధుడు పకపక నవ్వాడు. ''ఒక్క దెబ్బ! ఈ దెబ్బకు తట్టుకొని బయటపడగలననుకొంటున్నాడు కాబోలు, అఘాయకుడు!'' అని అంటూ తళతళ మెరిసే తన గండ్రగొడ్డలితో బలంకొద్దీ ఒక వేటువేశాడు, కంఠీరవుడి కంఠం మీద.

గండ్రగొడ్డలి కంఠంలో సగంవరకు దిగింది. కాని, ఒక్క నెత్తురు బొట్టయినా కింద రాలలేదు! కంఠీరవుడు తొణకకుండా అలా నిలబడే వున్నాడు! యోధుడితోపాటు కంఠీరవుడికీ అపరిమితమైన ఆశ్చర్యం కలిగింది. కంఠీరవుడు ఆ గొడ్డలిని ఇవతలకు లాగేసి, ఒక్కసారి మెడ తడివిచూసుకొంటే, అతనికి ఏమీ జరగనట్టే అనిపించింది.

యోధుడు నిర్ఘాంతపోయాడు. కోపం పట్టలేక, ''మోసం! మోసం!!'' అంటూ మళ్ళీ గొడ్డలిని ఎత్తబోయాడు.

కంఠీరవుడు ఉగ్రుడై ఖడ్గం దూశాడు.

అంతలో గిరిదుర్గ మహారాజూ, రాజకుమారీ అక్కడికి వచ్చి, వారిని ఆపారు. తనకు ఉపకారం చేసిన కంఠీరవుడికి తెలియకుండానే, అతని కవచంలో మహిమగల తన ఉంగరం దాచిన సంగతి రాజకుమారి తండ్రికి తెలియజెప్పింది.

నిజం తెలియగానే, ఎవరి ధర్మం వారు నెరవేర్చుకొన్నందుకు కంఠీరవుణ్ణీ, రాజకుమారినీ మెచ్చుకున్నాడు యోధుడు. తరవాత కంఠీరవుడి ధర్మబుద్ధికీ, ధైర్యానికీ సంతోషించి, రాజు అతనికి తన కూతురు నిచ్చి వైభవంగా వివాహం చేశాడు. యోధుడు కూడా దంపతులను దీవించాడు.





# పీరయ్య సహనం

పీరయ్య అనేవాడికి రాజు కొలువులో ఉద్యోగం వచ్చింది. అందుకు వాడు మహా గర్వపడిపోయాడు. వాడికి పెళ్ళాం బిడ్డల్ని పోషించేందుకు నెలకు యాభై వరహాలుచాలు. అయినా, వాడికి అయిదు వందల వరహాలు నెలజీతంగా వస్తున్నది!

నారయ్య అనేవాడు పీరయ్యకు చిన్ననాటి స్నేహితుడు. వాడు వీధుల వెంట తిరిగి కూరగాయలమ్మి, ఇతరత్రా కష్టపడీ నెలకు అయిదువందల వరహాల పైనే సంపాదిస్తున్నాడు. కానీ వాడికి పీరయ్యకున్న గౌరవం లేదు.

రాజు కొలువులో పని చేస్తున్నాడని, అందరూ పీరయ్యను గౌరవంగా చూసేవారు. కనిపించినప్పుడల్లా వాడికి చేతులు జోడించి దణ్ణం పెట్టేవారు. వాడి ముందు వినయంగా తలవంచి మాట్లాడేవారు. వీటితో పీరయ్యకు గర్వం పెరిగి నారయ్యను చిన్నచూపు చూస్తూ, క్రమంగా వాడితో మాట్లాడడం మానేశాడు.

ఇది నారయ్యకు కష్టంగా తోచింది. లోగడ వాడు ఎన్నోసార్లు పీరయ్యను కష్టాల్లో ఆదుకున్నాడు. ఇప్పుడు పీరయ్య అవన్నీ మర్చిపోయాడు.

రాజు కొలువులో పని చేస్తున్న పీరయ్య గొప్పతనమేమిటో తెలుసుకుందామని, నారయ్య ఒకసారి కొలువుకు వెళ్ళాడు. ఆ సమయంలో పీరయ్యనెవరో అనరాని మాటలని తిడుతున్నారు. నారయ్య కాస్త దగ్గర్లోవున్న మనిషిని పలకరించి, "అయ్యా! ఆయనెవరు? మా పీరయ్యను ఎందుకు తిడుతున్నాడు?" అని అడిగాడు.

ఆ మనిషి నారయ్యను హెచ్చరించి, "ఇష్! గట్టిగా మాట్లాడకు. ఆయన మా పైఅధికారి. అందువల్ల, ఆయన తిట్టడానికి కారణం వుండదు," అన్నాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

"అధికారి అయితే మాత్రం, ఉత్త పుణ్యానికి తిడితే ఊరుకుంటారా? ఎదిరించి బుద్ధిచెప్పొద్దూ?" అన్నాడు నారయ్య.

"ఎదిరించడానికి ధైర్యముండాలి; సమర్థతవుండాలి. ఈ రెండూ లేనివాడు ఎదిరిస్తే ఉద్యోగం పోతుంది. ఉద్యోగం పోతే బయట గౌరవం వుండదుమరి!" అన్నాడా మనిషి.

"ఆ అధికారి అందర్నీ ఇలాగే తిడతాడా?" అని అడిగాడు నారయ్య.

"అందరూ ఊరుకోరు. ప్రతివాడి సహనానికీ హద్దుంటుంది గానీ పీరయ్య సహనానికి హద్దురాదు, నువ్వే చూడు!" అన్నాడా మనిషి.

అధికారి పీరయ్యను గది శుభ్రంగా లేదని తిట్టాడు. అందుకు, ఊడ్చేవాడింకా రాలేదని పీరయ్య వినయంగా చెప్పాడు. తర్వాత పీరయ్య తనే గది ఊడ్చాడు. క్షణం ఆగి అధికారి, పీరయ్యను సరిగా గది ఊడవలేదని తిట్టి, ఎవరినో పిలవమన్నాడు. ఆ మనిషి ఇంకా రాలేదని పీరయ్య చెబితే, ఎక్కడున్నాడో వెతికి పిలుచుకురమ్మన్నాడు, అధికారి. పీరయ్య చాలాసేపు ఎక్కడెక్కడో తిరిగి, ఆ మనిషిని తీసుకువచ్చాడు. ఆ మనిషిని వెతకడానికి ఇంతసేపుపట్టిందని, అధికారి పీరయ్యనే నానా మాటలూ అన్నాడు.



నారయ్యకు, పీరయ్య బ్రతుకు బానిస బ్రతుకులా తోచింది. వాడు మనసులో, "నన్నుచూడగానేఎవరూచేతులుజోడించి దణ్ణం పెట్టనవసరం లేదు. కానీ చేయని తప్పుకు నానా మాటలూ అనడం, కాని పనులు చేయించడం నేను సహించలేను. నన్నెవ్వరూ ఎప్పుడూ అగౌరవపర్చలేదు!" అనుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

నారయ్య వచ్చి కొలువులో తన పరిస్థితి చూసి వెళ్ళాడని, పీరయ్య గమనించాడు. వాడికి చచ్చేటంత అవమానమయింది. నారయ్య తనను గురించి దుష్ప్రచారం చేస్తాడేమోనని భయపడి, వాడు ఆ రోజు సాయంత్రంకొలువునుంచి ఇంటికిరాగానే,

భార్యాబిడ్డలను తీసుకుని నారయ్య ఇంటికి వెళ్ళాడు. వాణ్ణి మంచి చేసుకోవాలనీ; తన ఉద్యోగం గురించి నాలుగు మాయకబుర్లు చెప్పాలనీ వాడి ఉద్దేశ్యం.

పీరయ్య వెళ్ళేసరికి నారయ్య, తన భార్యాబిడ్డలతో రాజు కొలువులో ఉద్యోగం చేసేవాళ్ళ బ్రతుకు బానిసల బ్రతుకును మించి దుర్భరంగా వుంటుందని చెబుతున్నాడు. ఆ సమయంలో పీరయ్య అక్కడికి వెళ్ళాడు.

వాణ్ణి చూస్తూనే నారయ్య, "సమయానికి వచ్చావు, పీరయ్యా! మా పనివాడు రెండు రోజుల నుంచి రావడం లేదు. దొడ్లో చెత్త పేరుకుపోయింది. కాస్త శుభ్రం చేసిపెడుదూ, ఊరికే పని చేయొద్దులే! అడిగినంత డబ్బిస్తాను," అన్నాడు తాపీగా.

దీనికి పీరయ్య మండిపడి, "ఇంటికి వచ్చిన చిన్ననాటి మిత్రుణ్ణి ఇంత అవమానం చేస్తావా?" అంటూ నానా తిట్లూ తిట్టాడు.

పీరయ్య భార్య ఎంతో బాధగా నారయ్యతో, "అన్నయ్యా! వేళాకోళానికైనా హద్దులుంటాయి. నువ్విలా మాట్లాడడం ఏమీ బాగా లేదు," అన్నది.

నారయ్య పీరయ్య భార్యతో, "నన్ను నువ్వు తప్పుగా అర్థం చేసుకున్నావు. రాజు కొలువులో పని చేసేవాళ్ళు కోపం పూర్తిగా మర్చిపోతారనీ, ఎంతటి మాటలన్నా సహనంతో భరిస్తారనీ, నా భార్యా పిల్లలకు ఉదాహరణగా చెబుదామనుకున్నాను. రాజు కొలువులో పీరయ్య సహనం చూసి, నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. అయితే ఆ సహనం రాజు కొలువులోనే వుంటుందనీ, కొలువు దాటివస్తే పీరయ్య మామూలు మనిషేననీ ఇప్పటిదాకా నాకు తెలియలేదు. అయితే ఏం, నాకిప్పుడెంతో సంతోషంగా వుంది. రాజు కొలువులో ఎలా వున్నా, చిన్ననాటి స్నేహితుడు పీరయ్య బయట మామూలు మనిషే!" అన్నాడు.

ఇది విని పీరయ్యతోపాటు వాడి భార్యా, నారయ్య భార్యా ఘొల్లున నవ్వారు.





## కంగారూ ప్రపంచం

ఆస్ట్రేలియాలో కనిపించే కంగారూలు శాఖాహార జంతువులు. పిల్లల్ని కడుపు దగ్గర వున్న సంచీలో మోసుకు వెళ్ళే ఈ వింత మృగాల ముందుకాళ్ళు పొట్టిగానూ, వెనకకాళ్ళు పొడవుగానూ ఉండడంవల్ల పెద్ద పెద్ద గెంతులు వేస్తూ పరిగెత్తగలవు. వీటిలో పెద్ద జంతువు తల, గొర్రెతల ప్రమాణంలో వుంటుంది. ఏడడుగుల ఎత్తువరకూ పెరుగుతుంది. కుందేళ్ళకన్నా చిన్న చిన్న కంగారూలూ వున్నాయి!

## మొసలి కన్నీళ్ళు!

ఒక మనిషి మరొక మనిషిని చంపి తింటే నరభక్షకుడంటారు. మాంసాహారులయిన జంతువులు ఈ కోవలోకి రావు. అయినా, మొసళ్ళు జంతువులను పట్టి తిన్నప్పుడు కన్నీళ్ళు కారుస్తాయి. అవి తాము చేసిన పనికి పశ్చాత్తాపంతో కన్నీళ్ళు కారుస్తాయా అంటే కానే కాదు. నిజానికి వాటి కళ్ళ నుంచి కారేవి కన్నీళ్ళు కావు. వాటి కళ్ళల్లో పేరుకుపోయిన లవణాలను, గ్రంథులు కన్నీళ్ళ ద్వారా వెలుపలికి పంపుతాయి.





## పాము 'చెవులు'!

పాములవాడి నాగస్వరం పాటకు పాము పడగవిప్పి ఆడుతుందని అందరూ అనుకుంటారు. కాని, అది నిజం కాదు. అపోహ! పాములవాడి నాగస్వరం కదలికకు తగ్గ విధంగా పాము తల ఆడిస్తుందే తప్ప, వాడి పాట విని కాదు. అసలు పాముకు చెవులు లేవు. అయితే, పాము నాలుకకు శబ్దతరంగాలను గ్రహించే శక్తి ఉన్నది. కావాలంటే, పాము నాలుకతో వింటుందని చెప్పవచ్చు!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ డిసెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: జాతి భేదం లేని చెలిమి!

రెండవ ఫోటో: జ్ఞానదీప్తినిచ్చు కలిమి!!

పంపినవారు: పి. ఉమారాణి, సరసన్న నగర్, కాకినాడ-533 003 (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

రజతోత్సవ సంవత్సరంలో

25

విజయచిత్ర



1966

రజతోత్సవ సంవత్సరంలో

మీ అభిమాన పత్రిక!

# విజయచిత్ర

25 సంవత్సరాలుగా సినీ పరిశ్రమకీ-

సినిమా అభిమానులకీ మధ్య వారధిగా

వుంటూ, వన్నెతరగని నాణ్యతతో

వెలువడుతున్న

ఏకైక సినిమా పత్రిక

# విజయచిత్ర

నాటినుండి నేటివరకు సినిమా అభిమానుల

ప్రియతమ పత్రిక!

# విజయచిత్ర

1991




ఇది ఒక డాల్టన్ ప్రచురణ

# JUNIOR QUEST



## NOW with the added fun of SPUTNIK Junior!




Selections from Sputnik Junior!.

* Colourfully illustrated stories and cartoons.
* Superb science fiction
* Entertainment and general knowledge

64 packed pages!
At just Rs. 6/-




To subscribe write to,

JUNIOR QUEST,
Dolton Agencies,
Chandamama Buildings,
N.S.K. Salai, Vadapalani,
Madras: 600 026.

A Chandamama
Vijaya Combines
publication



